; ; * ధా | పా ; - మాపా || మాగామా | నినిధా - పా ; ||
; ; * ఎం | దు ; - శు . || చ ప . | ల. . - త ; ||

ధా ; - పధ | నీ ; - ధానీ || సాసానీ | సా ; - సనిధని ||
. ; - విన | వే ; - నా. || మ న . | వి ; - ని . . . ||

సా ; * సని | ధాపామాపా || మాగామా | నినిధా - పా ; ||
. ; * ఎం | దు . శు . || చ ప . | ల. . - త ; ||

ధా ; - పధ | నీ ; - ధనిసని || సాసానీ | సా ; - సనిధని ||
. ; - విన | వే ; - నా. . || మ న . | వి ; - ని . . . ||

సారీ * గరి | నిసరిస - ధనిసని || ధపమగమా | నినిధా - పా ; ||
. . * ఎం | దు. . . - శు. . . || చ. ప . . | ల. . . - త ; ||

ధా ; - పధ | నీ ; - ధనిసని || సాసానీ | సా ; - సనిధని ||
. ; - విన | వే ; - నా . . || మ న . | వి ; - ని . . . ||

సాం ; * నిస | గగరీ - రిసాం || సాంసాంనీ | ధా , ని - సాం ; ||
. ; * ముం | ద. . - టి. || వ లె. | భ , . - . ; ||

నీధా ; | పధనిధ - ధపపమ || పపమా , గ | గరి , - సా ; ||
క్తుల ; | బో. . - . . . . || షిం. , . | చు. , - ట ; ||

సాం ; * నిస | గగరీ - రీసాం || సాంసాంనీ | ధానీ - సాంరిసీ ||
. ; * ముం | ద. . - టి . || వ లె. | భ . - . . . ||

నీధా ; | పధనిధ - ధపపమ || ధపపమమగ | రిగమగ - గరిరిస ||
క్తుల ; | బో. . - . . . . || షిం. . . . | చు . . - ట. . . ||

సా , ని *
. , . * (కెంటు దాఁగినాఁడో)

చ. ; ; * మగ | మా ; పా ; || ధానీ ; | నిదధా - పా ; ||
; ; * అల | నా ; డు ; || క న ; | క. . - క ; ||

మాపా ; | మాగా - మపధప || పమగా ; | రీ ; సా ; ||
శి పు ; | డు . - నిం. . . || డా . ; | . ; రు ; ||

; ; * మగ | మా ; పా ; || ధానీ ; | నిధధా - పా ; ||
; ; * అల | నా ; డు ; || క న ; | క . . - క ; ||

మాపా ; | మాగా - మపధప || పమగమపధ | పమగా - రీ ; ||
శి పు ; | డు . - నిం. . . || డా . . . . | . . . - రు ; ||

సా ; * మగ | మా ; పా ; || ధానీ ; | ధానీ - ధనిసా ||
. ; * అల | నా ; డు ; || క న ; | క . - క . . ||

సనిధనిసా | సనిధని - సాసా || సనిధాపా | పమగా - రీ ; ||
శి . పు. . | డు. . . - నిం . || డా . . | . . . -రు ; ||

సా ; * గ రి | గా ; - సా ; || రీస్నీ ; | సరిసా - సానీ ||
, ; * చల | ము ; - చే ; || . సి ; | సు. . - తు. ||

ధానీధా | ;; - గామా || గారీ ; | సా ; రీసీ ||
ని . . | ;; - స . || కల ; | బా ; . . ||

గారీ ; | గా ; సా ; || సారీసీ | సా ; - సానీ ||
ధల ; | బె ; ట్ట ; || గ . . | మ ; - ది . ||

ధానీధా | ;; - ధా ; || నీనీ ; | సా ; - ;; ||
ని . . | ;; - తా ; || శక ; | ని ; - ;; ||

;; * సరి | గా ; మా ; || ధా ; | నీ ; - సా ; ||
;; * శ్చలు | డై ; న ; || ప్ర ; | హ్లా ; - దు ; ||

; - ధానీ | సా ; - సానీ || నీనీధా | నీ ; - సా ; ||
; - కొలు | వు ; - గం. || బ . . | ము ; - లో ; ||

;; * ధని | సరిగరి - రిససని || నీనీధా | రీసా - నిసరీ ||
;; * పల | నుం . . - . . . . || డగ . | లే . - . . . ||

| | | | | |
|---|---|---|---|---|
| సా ; ; | సా ; | నీధా: | పమగా - రీ ; | ‖ |
| దా ; ; | యా ; | రీ . | తి . . - నే: | ‖ |

సాన్నీ

ందు దాఁగినాఁడో)

(ఇతర చరణములను ఇటులే పాడుకొనవల ను)

అవతారిక ఇందు అయ్యగారు, రామా! నీ వెంత కరుణాశాలివైనను సమర్థుఁడ వైనను కొండలవంటి నా పాపములఁ బాపి నీవుమాత్ర మెట్లు రక్షించెదవు ? అని స్వాపరాధ ప్రాబల్యమును గురించి చింతిల్లుచున్నారు.

(24) ఆహిరి - త్రిపుట

ప. ఎటుల పాడుదువో శ్రీరామచంద్ర

అ. ఎటుల పాడుదువో రఘువీర

మటు య సంసార - మందుఁ దగిలిన స నే.

చ. అనుదినమును దార - తనయ వర్గాదుల పా-లనము చేయుకొ౽అకు-ధనములు కలిగిన
మనుజులఁ బొగడి యార్జిం-చిన పైకములఁజూచి-తనకు సరిలేదని బిగు-వునఁ దిరిగిన న(న్నే)

2. కాయజజనక నా-ప్రాయము లెల్లను - మాయా పూరితులైన-దాయాదులచేత
సాయం పర్యంతము-కాయక్లేశము జెంద-నాయెనుగాని మాని-ధ్యేయ నిన్ను దెలియ లేని న()

3. సతమని బాంధవుల-జతను నమ్మి మదికి-హితవు లేక యో-పతితపావన సం -
తతము త్యాగరాజ-హిత సురనికర పూ-జిత నిన్నే శరణుచొ-చ్చితిఁగాన రామ న (న్నే)

ప్రతిపదార్థము.

రఘువీరా - రఘువంశపు వీరుఁడా !
మటుమాయ సంసారమందుఁ - మిక్కిలి మోసము
  చేయు సంసారమునందు
తగిలిన - నన్ను - చిక్కిన నన్ను
ఎటులు కాపాడుదువో - ఏవిధముగ రక్షింతువో
అనుదినమును - ప్రతిదినమును
దారతనయ వర్గాదుల పాలనము సేయుకొ౽అకుఁ -
  భార్యాపుత్రులు మొదలగువారిని కాపాడుకొ౽అకు
ధనములుగలిగిన మనుజులఁ-ద్రవ్యముగల మనుష్యులను
పొగడి - స్తోత్రము చేసి
ఆర్జించిన పైకములఁ - సంపాదించిన ద్రవ్యములను
చూచి - కని

తనకు సరిలేదని - తనకు సమానుఁ డొక్కఁడును లేఁడని

బిగువునఁ - బెట్టుతో

తిరిగిన నన్నుఁ-సంచరించిన నన్ను

(ఎటుల కాపాడుదువో)

కాయజజనక - మన్మథుని కన్నతండ్రి

నా ప్రాయములు ఎల్లను - నా వయఃకాలములయందంతను

మాయాపూరితులైన దాయాదులచేతఁ - మోసగాండ్రగు జ్ఞాతులచేత

సాయంపర్యంతము - సాయంకాలము వఱకు

కాయక్లేశముఁ - శరీర కష్టమును

చెందనాయెను కాని - పొందవలసి వచ్చెనే తప్ప

మౌనిధ్యేయ - మునులచే ధ్యానింపఁబడు రామ

నినుఁ - నిన్ను

తెలియనైతిఁ - ఎఱుఁగనైతిని

(నన్నెటుల కాపాడుదువో)

సతము అని - స్థిరమని

బాంధవుల జతను - బంధువులతోడును

నమ్మి - నమ్మి

మదికిఁ - మనస్సునకు

హితవు లేక - ఇష్టము లేక

ఓ పతితపావన - పాపులను పవిత్రము చేయువాఁడా

త్యాగరాజహిత - త్యాగరాజున కాప్తుఁడా

సురనికర పూజిత - దేవతల సమూహముచే పూజింపఁబడువాఁడా

సంతతము - ఎల్లప్పుడు

నిన్ను ఏ - నిన్నే

శరణుచొచ్చితిఁ కాన-(నీవేదిక్కని) ఆశ్రయించితిని గాన (నన్నెటుల కాపాడుదువో)

విశేషార్థము :— నా నడతలు నీ యాజ్ఞారూపములగు శాస్త్రములకు బహుదూరములైనవి, అట్టి శాస్త్రానుసారముగ నన్ను శిక్షించి వెనుకఁ గటాక్షించవలె నన్న, 'యద్బ్రహ్మకల్ప నియతానుభవేప్య నాశ్యమ్' అను నటులు ఒక్కొక్క బ్రహ్మకల్పాంతము ననుభవించినను నా పాపములు దీరునవిగావు; కావున నీవు నీ యాజ్ఞారూపమగు శాస్త్రము మరియాదలను పాలించెదవా ? లేక కృపకు లోఁబడినవాఁడవై పైఁ జెప్పిన శాస్త్రనియమము సరకుచేయక నన్నుఁ బాలించెదవా ? అనుచున్నారు.

'అనుదినము...' ఇత్యాదులచే నా పొట్టపోసికొనుటకును, భార్యాపుత్రులను కాపాడుటకును ఒక సామాన్యుని, నీవు ఇంద్రుఁడవు, చంద్రుఁడవు, అని స్తుతించి ఇట్టి నీచవృత్తిచే నాలుగు రూకలార్జించి దుర్దానములబట్టి యుంగరముఁ బెట్టుకొని కులికినటులు గర్వించి నాకన్న మిన్నగువా రెందఱో యుండ నాకు సమానుఁడు లేఁడని తిరిగితిని. అనియును, 'కాయజజనక...' ఇత్యాదులచే నా యౌవన కాలమున ధనధాన్యాదులకై దాయాదులతో పోట్లాడి, 'రాత్రిన్దివమపి భిక్షాచర్యా। కలహాయైవాగచ్ఛతి భార్యా। మధ్యే బాంధవ సేవా కార్యా'

అని రాత్రిపగళ్లు తిండికి వెదకికొనుచు, మధ్యమధ్య భార్యతో జగడములాడుచు, వచ్చిన చుట్టముల నాదరించుచు, ప్రతిదినమును ఉదయము మొదలు అస్తమయమువఱకు సంసార కృత్యములయందే కాయక్లేశమును పొందితినిగాని, 'జిహ్వే కీర్తయ కేశవం' అను నటులు నీ గుణానుభవ కైంకర్యములయందు శరీర శ్రమను జేసినవాఁడనుగాను అనియును తెలిపి, ఇట్టి నన్నెటుల కాపాడుదువో యనుచున్నారు.

'సతమని...' ఇత్యాదులచే, తన యౌవన కాలమంతయు అన్యపురుష సంగమముతోఁ గడిపి వానిచే చీవాట్లుతిని నిరసింపఁబడినదియై సిగ్గు భయములేక వార్ధక్యమున సొంత భర్త దగ్గఱకు వచ్చి, 'పోయిన కాలము పోయినది, ఇంక నీతో నే ననుకూలముగ నుండెదను.' అని చెప్పిన ఒక దుర్జాతిస్త్రీ చందముగ, నాకు వలసినంతవఱకు సంసారమున భార్యాపుత్రులు బంధువులు మొదలగువారితో కలసిమెలసి యుండి అందేమియును పసలేనందున నిప్పుడు నిన్నాశ్రయించితి నని స్వాపరాధమును దెలిపి, ఇట్టి పాపచర్యలు గల నన్నెటుల కాపాడుదువో రామా! అనుచున్నారు.

ఆహిరి రాగలక్షణము :— ఇది ప్రాక్ప్రసిద్ధమైన అష్టాదశ మేళములలో నెనిమిదవ మేళము. ఈ రాగ మిప్పుడు 8-వ మేళమైన హనుమతోడియందు జన్యమని చెప్పఁబడు చున్నది. మఱియు నిది 20-వ మేళమైన నటభైరవియందు జన్యమని కొందఱు గ్రంథకారుల యభిమతము. అనుభవ ప్రకారముగ నీ రాగమును గమనించునపుడు ఇందు ప్రతిమధ్యమము తప్పఁ దక్కిన స్వరము లన్నియును అచ్చటచ్చటఁ బలుకుచున్నవి. ఈ కారణముచే నీ రాగము యొక్క జనక రాగ మిదియని నిర్ణయించుటకు సాధ్యముగాక యున్నది. ఈ రాగమునందలి మూర్ఛనలను దెలిసికొనుట కనుభవమే ముఖ్య సాధనముగ నున్నది. అట్లుగాక లక్షణములచే లక్ష్యమును సమకూర్చుట యను విషయము సంగీతవిద్వాంసులకే సాధ్యముకానిది యగును. ఎవరైన నీ రాగమును బాడునపుడు ఒకటిరెండు పరియాయములు వినిన వారికి లక్షణమువలన లక్ష్యమును నిర్ణయింప సాధ్యమగును, అందుకుగాను నీ క్రిందఁ గొన్ని ముఖ్యమైన విషయములను వ్రాసితిని. ఈ రాగము రాత్రియందు మొదటి యామములోఁ బాడఁదగినది. ప్రాతఃకాలమునం దీ రాగమును బాడినయెడల నన్నభావము గలుగునని చెప్పుట లోకమునందు వాడుకగనున్నది.

ఈ రాగమున నారోహణావరోహణములయందుఁ గల నిషాధ ధైవత గాంధారములను దీర్ఘముగ వాడుటవలన రాగకళలు గలుగుచున్నవి. దీర్ఘ స్వరములచేతను, స్వల్ప వరికల చేతను నీ రాగము వాడఁదగినదియై యున్నది. ఇది సంపూర్ణరాగముగ నుండినను ఇందు మధ్యకాల మూర్ఛన లెంతమాత్రమును పనికిరావు.

ఆరోహణము. అవరోహణము.

స రి స గ మ ప ధ ని స స ని ధ ప మ గ రి స

ఇందు స్వరముల వివరముల నెఱుంగుటకై కొన్ని యంశముల నీ దిగువఁ జూపుచున్నాము :

1. శుద్ధ ఋషభములు :— సరిస - నిసరిరిస - మాగరీ - గరీ మున్నగునవి.

2. చతుశ్శ్రుతి ఋషభములు :— రిరిస - పరిరిస - ధరిరిస మున్నగునవి.

3. సాధారణ గాంధారములు :— సరిగరిస - గారిస - గమగారిస - మపామగారిస - గగారిస మున్నగునవి.

4. అంతర గాంధారములు :— మగమా - మగామప - సమగమమప - గమపధ నిధా మున్నగునవి.

5. శుద్ధ ధైవతములు :— పధనిధా-నిధపమగా-సనిధాప-ధనిధనిధాప మున్నగునవి.
6. చతుశ్శ్రుతి ధైవతములు :— దాధనీపా - ధానీసా - దాధనిసనీ మున్నగునవి.
7. కైశికి నిషాధములు :—ధానిసా-సనిధాప-పధనీధాప-పమపధనీధప మున్నగునవి.
8. కాకలీ నిషాధములు :— నిసరీస - సనిసారీ - నిసనీసా - నిసనిరీ మున్నగునవి.

ఇక నీరాగమునందు రక్తిగల ప్రయోగముల వివరము :— మాగరిస - పనిధాపమ గారిస - సాసనిధాపా - పమపధనీధాప - మపామ - గమాగగా - గరీస - సరీసగామాగరీస - సనిసాస - నిసరీ - సరిరిసా - సనిధానిధాప - పధపమగా - మగరీసా మున్నగునవి.

ప. ; ; * పధ | పా , మ | మా ; || గారీ ; | గా ; | మా ; ||
; ; * ఎటు | ల , . | గా ; || పా. ; | డు ; | దు ; ||

గమగా ; | రీ ; | సా - గమ || పా ; మా | పా ; | ధానీ ||
వో . ; | . ; | . - శ్రీ. || రా ; మ | చం; | ద్ర . ||

ధాపా *
. . * (ఎటుల)

అ. ; ; * ధ ని | సా ; | సా ; || సా , సా , | సా ; | సా ; ||

; ; * ఎటు | ల ; | గా ; || పా , డు , | దు ; | వో ; ||

; ; * ధ ని | సా ; | నీధా || ధానీ ; | ధా ; | పా ; ||

; ; * రఘు | వీ ; | . . || ర . ; | . ; | . ; ||

; ; * ని ధ | నీ ; | సా రీ || సా ; ; | సనిధా | ధానీ ||

; ; * మరు | మా ; | య . || సం ; ; | సా . | ర . ||

ధాపా - పధ | పమమా | మా ; || పా ; పమ | పధపా | ధానీ ||

. . - మం | దు . . | ద ; || గి ; లి . | న . . | న . ||

ధాపా *

. . * (నెన్నెటుల)

చ. ; ; * పధ | పా ; | పామా || మగమా ; | గారి | రి ; ||

; ; * అను | ది ; | న . || ము, ను ; | దా . | ర ; ||

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ; ; * సరి | గా ; | రీ ; | ‖ సా , నీ ; | సా ; | సా ; | ‖ |
| ; ; * తన | య ; | వ ; | ‖ ర్గ , ము ; | ల ; | పా ; | ‖ |
| ; ; * సరి | గా ; | మా ; | ‖ పాపామా | ధాపా | ధానీ | ‖ |
| ; ; * లన | ము ; | సే ; | ‖ యుట . | కొ ఱ | కు . | ‖ |
| ధాపా * పధ | పా ; | పామా | ‖ పా ; ; | ధాపా | ధా ; | ‖ |
| . . * ధన | ము ; | లు . | ‖ గ ; ; | ల్గి . | న ; | ‖ |
| ; ; * నిధ | నీ ; | సా ; | ‖ సాసా ; | సా ; | సా ; | ‖ |
| ; ; * మను | జు ; | ల ; | ‖ బాగ ; | డి ; | యా ; | ‖ |
| సా ; - ధని | సా ; | సా ; | ‖ సానిధా | ధా ; | ధానీ | ‖ |
| ర్జం ; - చిన | పై ; | క ; | ‖ ముల . | జూ ; | చి . | ‖ |
| ధాపా * సని | సారీ | సా ; | ‖ సా , సని | ధా ; | ధానీ | ‖ |
| . . * తన | కు . | న ; | ‖ గ , లే . | ప ; | ని . | ‖ |

| ధాపా - పధ | పామా | గా ; | ‖ పాపామా | పాధప | ధానీ | ‖ |
|---|---|---|---|---|---|---|
| . . - బిగు | వు . | న ; | ‖ రి రి . | గిన . | న . | ‖ |

ధాపా *
. . * (నైటుల)

(ఇతర చరణములను ఇటులే పాడుకొనవలయును.)



అవతారిక :— ఇందయ్యగారు, 'యన్మనసా ధ్యాయతి తద్వాచావదతి తత్క్రియ యాకరోతి' అనునటులు శ్రీరామచంద్రుని పూజా కైంకర్యములను మనస్సుచే ననుభవించుచు, నోరారఁ బాడుచు, చేతులారఁ జేయుచు, 'ఏకస్స్వాదు నభుంజీత' అనునటులు ఇట్టి యానందము తా నొక్కఁడే యనుభవింపఁగూడదు గాన తనతోఁ జేరిన భక్తుల నెల్లరను సంభోధించి శ్రీరాముని పూజింపుఁడని పురికొలుపుచున్నారు.

(25) ఆహిరి - చాపు.

ప. చల్లరే రామ - చంద్రునిపైని పూలఁ (జ)
చ. సొంపైన మనసుతో - నింపైన బంగారు - గంపలతో మంచి - చంపకములను (జ)

2. పామరతనుమాని - నేమముతో ర - మా మనోహరునిపైని - దామరపూలఁ (జ)
3. ధాతృవినుతుఁడైన - సీతాపతిపైని - జేతులతోఁ బారి-జాత సుమములను (జ)
4. ఈ జగతిని దేవ - పూజార్హమౌ పూల - రాజిలో మేలైన - జాజి సుమములను (జ)
5. అమిత పరా(క్రమ-ద్యుమణి కులార్ణవ - విమలచం(దునిపై హృ-త్కుముద సుమములఁ()
6. అనయము జనన మ - రణములు లేకుండ - మనసారఁ ద్యాగరా - జనుతునిపైని (జ)

ప్రతిపదార్థము.

పామరతనుమాని - అజ్ఞానమును తొలఁగించుకొని
నేమముతోఁ - నియమముతోడ
రమా మనోహరుపైని - లక్ష్మీనాథునిపైని
తామరపూలను - పంకజములను (చల్లరే)
ధాతృ వినుతుఁడైన సీతాపతిపైని- బ్రహ్మచే నమస్క-
రింపఁబడిన శ్రీ సీతారామునిపైని
చేతులతోఁ - కరములచే

రామచంద్రునిపైని - శ్రీరామచంద్రునిమీఁద
పూలఁ - పుష్పములను
చల్లరే - చల్లుదురుగాక
సొంపైన మనసుతోఁ - సంతోష చిత్తముతో
ఇంపు ఐన - అందమైన
మంచి చంపకములను - మంచి చంపక పుష్పములను
బంగారు గంపలతోఁ - బంగారు గంపలయందునించి
(చల్లరే)

పారిజాత సుమములను - పారిజాత పుష్పములను
(చల్లరే)
ఈ జగతిని దేవపూజార్హమౌ - ఈ లోకమునందు
దేవపూజకు యోగ్యమైన
పూలరాజిలోఁ - పుష్ప సముదాయములలో
మేలైన - మేటియైన
జాజిసుమములను - జాజి పుష్పములను (చల్లరే)
'అమిత ... పైని'
అమిత పరాక్రమ - మితిలేని పరాక్రమముగల
ద్యుమణి కులార్ణవ-సూర్యవంశమనెడు సముద్రమునకు

విమలచంద్రునిపైని - మలినములేని చంద్రునివంటి
శ్రీరామునిపైని
హృత్కుముద సుమములను - హృదయమనెడి తామర
పూవులను (చల్లరే)
అనయముఁ - తఱచుగా
జననమరణములు లేకుండఁ-పుట్టుచావు లేకుండుటకై
మనసారఁ - మనస్సు తృప్తిఁ జెందునటులు
త్యాగరాజనుతునిపైఁ - త్యాగరాజుచే కొనియాడఁ
బడిన శ్రీరామునిపైని
(చల్లరే ... పూల)

విశేషార్థము :— 'పామరతను' ఇత్యాదులచే, లక్ష్మీదేవి మనస్సును సయితము హరించునట్టి భగవంతుని పూజించునపుడు మీ మనస్సులకు అన్యవస్తువులపైని పామరత్వ మెట్లు గలిగె? హా! హా!! మీ యజ్ఞానపటిమము! సర్వము నాకర్షించి వశపఱచుకొను భగవంతుఁడు సయితము మిమ్మును సంసారమునుండి తొలఁగించి మీ పామరత్వమును

మాన్పింపఁజాలక పోయెనే! ఇట్టి మీ పామరత్వము నింకనైన మానుఁడు. 'తులసీ కాననం యత్ర యత్ర పద్మవనాని చ' అనునటులు భగవంతునకు నిత్య నివాసయోగ్యములుగ నున్న తామరపుష్పములతో వానిని పూజింపుఁడు. మఱియు మీ మనస్సుల నన్యవిషయములకుఁ బోనీక శ్రీమన్నారాయణునియందే నియమముగ నిలుపుఁడు, అని పరులకు ఉపదేశము చేయుచున్నారు.

'చేతులతో' 'పాణిద్వంద్వ సమర్చయ' అనునటులు భగవంతుఁడు మీకు శరీరాంగములుగ నిచ్చిన చేతులకు ముఖ్యముగఁ జేయవలసినపని భగవదర్చనమే గదా? దీనిఁబాసి వేఱు కృత్యము లొనర్చుట, 'శస్త్రీ శత్రుజయాయ నైజగురుణా దత్తైఽథ తేనైవచేత్పుత్రో హంతి నిజం శిరః' అనునటులు, తండ్రి శత్రునాశనము చేయుటకై రాజకుమారుని కిచ్చిన ఖడ్గము చేతనే ఆ రాజకుమారుఁడు తన గొంతు కోసికొన్న చందమగును గదా? అని భావము.

'అమిత పరాక్రమ...' ఇత్యాదులచే మహాపరాక్రమ సంపన్నమై చతుస్సముద్ర ముద్రితమగు భూమండలమును పాలించిన సూర్యవంశపు రాజులలో అగ్రగణ్యుఁడగు శ్రీరామ రాజును సంతోషపెట్టుటకు మనఃపుష్పము లే తప్ప నితర పుష్పంబు లెవ్వియును తగవని కేవల

మానస పుష్పమును నిరూపించుచున్నారని యొక భావము. మఱియుఁ జంద్రునకుఁ గలువ పువ్వులవలె శ్రీరామచంద్రునకు మనస్సులనెడి కలువపూవులు మిక్కిలి ప్రియములైనవి యని మఱియొక భావము. 'విమలచంద్రా' అనుటచే సాధారణములగు కలువపూవులు సకలంక చంద్రుని సంతోషపెట్టినను బెట్టునేమో గాని, అకలంక చంద్రునివంటి రామచంద్రునకు మనఃకుముదములే కావలయునని భావము.

ప. ; * ప | ధప - పమ || గమా | గరిసా ||
; * చ | ల్ల. - రే. || రా. | మ. . ||
; * రి | గారీ || సా , | రి సరీ ||
; * చం | ద్రుని || పై , | పూ.ల ||
; * ప | ధప - పమ || గమా | గ రీస ||
; * చ | ల్ల . - రే. || రా. | మ . . ||
అ. ; * ధ | నీసా || సాసా | రిసి రీ ||
; * సో0 | పైన || మ న | సు.లో ||

| | | | | |
|---|---|---|---|---|
| ; * సే | సాసా | ‖ సనిధా ; | ధా ; ధనీధ | ‖ |
| ; * నిం | పై న | ‖ బం . ; | గా ; రు. . | ‖ |
| పా - ధ | నీసా | ‖ ని సానిధా | ధా ; - ధనీధ | ‖ |
| . - గం | పల | ‖ తో . . . | మం ; - చి. . | ‖ |
| పా - ప | పమమామా ; | ‖ మపమ | పా ; ధనీధ | ‖ |
| . - చం | ప . . క ; | ‖ ము. . | ల ; ను. . | ‖ |

పా

• (చల్లరే రామ)

(ఇతర చరణములను ఇటులే పాడుకొనవలయును.)



అవతారిక :— ఇందు అయ్యగారు, శ్రీరామా ! నీ స్వధర్మమునందే నీ వుందువని నమ్మి సేవించితిని. ఇప్పుడు చూడ నీ యనుష్ఠానము, నీ యభిప్రాయమునకు వేఱై నట్లున్నది. ఇఁక నీవు స్వధర్మమును విడువక నన్ను గాపాడుమని ప్రార్థించుచున్నారు.

(26) పున్నాగవరాళి - ఆది.

ప. ఇది నీకు మేరగాదురా శ్రీరామ నా - మది తల్లడిల్లెనురా (ఇ)

అ. పదిలముగాఁ గొల్చిన - భావము వేఱై యున్నది (ఇ)

చ. గతిలేనివారిని గడతేర్చు దైవమని - పతితపావన నమ్మితి శ్రీరామ ని-
న్నతి వేగమున వేఁడితి సంతతము స - మ్మతిని నిన్నే కోరితి శ్రీరామ (ఇ)

2. పరమ దయాళువని పాలన సేతువని - సరగున దేవరాయ కొల్చిన నాపైఁ
గరుణలేదని కన్నీ రాయెఁ జూచి నీమనసు - కరఁగ దెందుకురా ఓ సీతారామ (ఇ)

3. అన్నిట నిండవే యమృతానందఘన - మన్నన సేయరాదా శ్రీరామా నీ
కెన్నరానిపుణ్యము రాదా శ్రీత్యాగరాజ-సన్నుత నీవాఁడనుగాదా శ్రీరామాసీతారామ()

ప్రతిపదార్థము.

పదిలముగ౯ - భద్రముగ

కొల్చిన౯ - సేవింపఁగ

భావము - (నీ) యభిప్రాయము

వేఱైయున్నది - యుండున్న ...ందముగ లేదు

ఇది - ఇట్లుండుట

నీకు౯ మేరగాదురా - నీకు ధర్మముగాదురా

శ్రీరామా - శ్రీరామ
నా మది - నామనస్సు
తల్లడిల్లెనురా - తన్నుకొనుచున్నదిరా
పతితపావనా - పాపులను పవిత్రులఁ జేయువాఁడా
గతిలేని వారినిఁ - దిక్కులేని వారిని
కడతేర్చు దైవము అని - గట్టెక్కించు దేవతయని
నమ్మితిఁ - నమ్మియుంటిని
శ్రీరామా - శ్రీరామ
నిన్నుఁ - నిన్ను
అతివేగమునఁ - మిక్కిలి త్వరతోను
వేఁడితిఁ - స్తోత్రము చేసితిని
సంతతము - ఎల్లప్పుడును
నమ్మితిని - ఇష్టముచేత
నిన్ను ఏ - నిన్నే
కోరితిఁ - ఆశగొంటిని (శ్రీరామ ఇది నీకు మేర గాదు)

దేవరాయా - దేవతలకెల్ల దైవమా
పరమ దయాళువు అని - మిక్కిలి దయగలవాడనియు
పాలన సేతువు అని - కాపాడెద వనియు
సరగునఁ - తటాలున
కొల్చిన నాపైఁ - సేవించిన నామీఁద
కరుణ లేదని - నీకు దయ లేదని
కన్నీరు ఆరెనుఁ - నాకుఁ గంటనీరు గారెను
చూచి - ఇట్లేడ్చుచున్న నన్ను చూచి
నీ మనసు - నీ మనస్సు
ఎందుకు కరఁగదురా - ఏల మెత్తఁబడదురా (శ్రీరామా ఇది నీకు మేర గాదురా)
అద్భుతానందఘన - ఆశ్చర్యమును ఆనందముచే నిండినవాఁడా
అన్నిటఁ నిండవు ఏ - అన్నిచోట్ల నుండెదవా
మన్నన సేయరాదా - నన్నాదరింపరాదా

శ్రీరామా - శ్రీరామా
నీకుఁ - నీకు
ఎన్నరాని పుణ్యము - పరిమితిలేని పుణ్యము
రాదా - కలుగదా

త్యాగరాజ సన్నుత - త్యాగరాజుచేఁ గొనియాడఁ బడినవాఁడా
నీవాఁడను కాదా - నీకు సొంతవాఁడను కానా ?
(శ్రీరామ సీతారామ (ఇది నీకు మేరగాదురా)

విశేషార్థము :— శ్రీరామా! దిక్కులేనివారల కెల్లరకు నీవే దిక్కనియు, వారి కెన్ని పాపములున్నను నీవు కటాక్షించిన మటుమాయమగు ననియు నమ్మి వెనుక ముందు యోచింపక, 'ఆజగామ ముహూర్తేన' అనునటులు అలనాఁడు విభీషణుఁడు లంకారాజ్యమును వదలి తటాలున వచ్చి, 'సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే' అని సమస్తలోకమునకు దిక్కగు శ్రీ రామచంద్రా! యని ప్రార్థించినట్లు, అన్నియు వదలి నిన్నేనుతించి, ఆ భావ మెప్పటికిని మార్పక నిన్నే కోరియుంటిని. నీవు మాత్రము నీ భావమును మార్చినటులున్నది. ఈ విషయము మఱియొకనితో నేను చెప్పకొనవలెనన్న, 'తం దేవతానాం పరమంచ దైవతం' అనునటులు నీవే మొదటి దేవుఁడవు గాన మఱెవరితో చెప్పకొందును. పరమదయాళువగు నీవు పాలించనందుకు అమృతము పులిసినట్లాయెనని నాలో నేను క్రుంగి యేడ్చుచున్నాను.

ఈ నాదుఃస్థితిని జూచియైనను నీకు దయరాదా ? నేఁ జూడలేదనుటకు నీవు లేనితావును గలదా? సదానందమయుఁడవగు నీకు నా దుఃఖమునుజూడ శక్యమగునా ? కావున నేది యెట్లున్నను నీ సొమ్మును నీవు బాగుజేసికొనుటకై నేను జెప్పవలెనా ? ఈ అనన్యగతికుని కటాక్షించుట, 'సమహాత్మా సుదుర్లభః' అనునటుల తగిన భక్తుఁడు దొరకలేదే యని వెదకికొను నీకు ఇది లాభముకాదా. ఇట్లుండ నీ యభిప్రాయము ఎందుకు వేత్తై యుండవలెను ? ఆ మర్మము తెలియక తల్లడిల్లుచున్నానని భావము.

పున్నాగవరాళి రాగ లక్షణము :— ఇది 8-వ మేళమైన హనుమతోడి రాగమునందుఁ బుట్టినది. నిషాదాంత్య రాగము. అనఁగా మంద్రస్థాయి నిషాధమునుండి మధ్యస్థాయి నిషాధమువఱకును గానము చేయఁదగినది. మఱియు నీ రాగము మంద్ర నిషాధము మొదలు మధ్య ధైవతమువఱకే పాడఁదగినదని కొందఱు గ్రంథకారుల మతము. అయినను క్షేత్రజ్ఞుఁడు మొదలగు ప్రసిద్ధ వాగ్గేయకారకులు ఈ రాగమును నిషాదాంత్యముగ మధ్య నిషాధమును చేర్చియే గానము చేసినటులు గీత కీర్తనాదులచే తెలియుచున్నది. ప్రకృతము

సంమును ఈ వాదుకయే గనఁబడుచున్నది. అదియునుం గాక యీ రాగమునకు మధ్యస్థాయి యందుఁ గల ధైవత సంకలితమైన నిషాధమే ప్రధాన రాగకళగ నున్నది. అందుచే నీ నిషాధమును వర్జించుట యుక్తము కానేరదు. మంద్రస్థాయియందు దీర్ఘ గాంధార మధ్యమములును, కైశికీ నిషాధ సంకలిత శుద్ధ ధైవతమును రాగచ్ఛాయా స్వరములు. ఎల్లప్పుడును గానము చేయఁదగినదని కొందఱి మతము. రాత్రికాలమునందు గానము చేయఁదగినదని కొందఱి మతము. ఈ రాగములో 'గరిగా' అను చోట చతుశ్శ్రుతి ఋషభము పలుకును. గమక వరికలచే రక్తి గలిగియుండు రాగము.

ఆరోహణము.

ని స రి గ మ ప ధ నీ

అవరోహణము.

ని ధ ప మ గ రి స స

'గారిసనీ - గరిగా - గమామగా - గమపాపా - ధనిధాపా - ధనీధపామ - సగరిగా - నిగారిస - సప్పామగారిస - మద్ధాపపమగా మున్నగు ప్రయోగములు రాగరంజకములైన యవి.

ప. ; * గగ - గాగా - గరిగా , - సరిగారీ | గా ; ; - ధప | మాపధపా ; - మగగరి ||

; * ఇది - సకు - మే.ర , - గా.దు. | రా ; ; - శ్రీ. | రా . . . ; - మ . . . ||

సరి * ,, | ,, | ,, ||

.. * ,, | ,, | ,, ||

సా * రి గరీసా - నీ ; - సరిగమ | ,, | ,, ||

నా * మదితల్ల - డి ; - ల్లె. ను. | ,, | ,, ||

,, *

,, * (ఇది నీకు)

అ. ; * మమమామా - మా - ధ పమగగా | ; - గా , మపా | పమమగ - గ రి రి స ||

; * పదిల ము - గా - గొ. ల్చి. న | ; - భా , వ ము | వే. డ్జై. - యున్న . . ||

స్వి *

ది * (ఇది నీకు)

చ. ; * గాగాగా - గా ; గరిగా | ; - మాపాధప | మాధాపమగా - గరిసని ||

; * అన్ని టి - నిం ; డ. వే | ; - అద్భుతా. | నం . ద . . - ఘు. న. ||

; * ,, | ; మాపానినిధప | ,, ||

; * ,, | ; అద్భుత.... | ,, ||

; * సరిగ రిరిస - నీ నీ - సరిగరి | గా ; ; - ధ ప | మాపధపా, మ - మగగరి ||

; * మ.న్న. న. - సేయ - రా. . | దా ; ; - శ్రీ . | రా . . . , . . - మ . . . ||

సని * సరిగరిసా - నీ నీ - స రి - గరి | గా ; ; - ధప | మాపధపామా - మగగరి ||

నీ . * కెన్నరాని - పుణ్య - ము. - రా . | దా ; ; - శ్రీ.. | త్యా . . . - గ . రా ||

సని * సరి - గ రిసా - రి ససనినీ - సరి | గా ; ; - మప | ధనిధప - మగగరి ||

జ . * స. - న్న. త - నీవా. డను - గా . | దా ; ; - సీ . | తా . . . - రా.మ. ||

సని *

. . * (ఇది నీకు)

(ఇతర చరణములను ఇటులే పాడుకొనవలయును.)



అవతారిక :— ఇందు అయ్యగారు భగవంతు నాశ్రయించి అస్థిరములగు నీ భోగ భాగ్యము లేమియు వలదు, 'త్వత్పాదపద్మ ప్రవణాత్మ వృత్తేః ర్భవంతి సర్వే ప్రతికూల రూపాః' అనునటులు నీ పాదారవిందములయం దభిరుచి గొన్నవానికి గృహక్షేత్రాదులన్ని యును ప్రతికూలములుగ నగుచున్నవి. కావున బ్రహ్మాదిసేవ్యమగు నీ పాదారవింద మొక్కటితప్ప నాకేమియు వలదని వేడుచున్నారు.

(27) పున్నాగవరాళి - ఆది.

ప. హరిహరి నీమొక్క దివ్య పా - దార వింద మియ్యవే (హ)

అ. ధరనుగలుగు భోగ భాగ్యమెల్లను - తథ్యముగాదు సుమీ శ్రీకృష్ణా (హ)

చ. సనక సనందన శ్రీనారద శుకా - ద్యున మునులెల్ల నుతించ
వనజనయన బ్రహ్మాది సంక్రందన - ఘనులెల్ల సేవించ
మును వేదపురాణాగమ శాస్త్ర - ములయందెల్ల చరించ
ఘనసనునీల నిరంజన నిర్గుణ - కనికరముగ త్యాగరాజు భావించ (హ)

## ప్రతిపదార్థము.

శ్రీకృష్ణా - శ్రీకృష్ణా
ధరను - భూమియందు [భవము లన్నియును
కలుగు భోగభాగ్యములు ఎల్లను - ఉన్నట్టి భోగాను
తథ్యము - సత్యము
కాదు సుమీ - కాదు సుమా
హరిహరి - హరిహరి (ఆహా!) [మొక్కటి మాత్రమే
నీయొక్క దివ్య పాదారవిందము - నీ పాదారవింద
ఇష్యవే - కటాక్షింపుమా
సనక...ఎల్లగ - సనకసనందనాదులు, నారదులు,
శ్రీశుకుఁడు, అర్జునుఁడు, మునులు అందఱుగూడ
నుతించగ - కొనియాడుచుండఁగ
వనజనయన - తామరరేకులవంటి కన్నులుగలవాఁడా
బ్రహ్మాది సంక్రందన ఘనులు ఎల్లగ - బ్రహ్మ మొదలు
కొని ఇంద్రుఁడు మొదలగు గొప్పవార లెల్లను

సేవింపగ - సేవించుచుండఁగ
మును - ముందుగ
వేదపురాణ...ఎల్లగ - వేదములు పురాణములు ఆగమ
ములు శాస్త్రములు బ్రహ్మవిద్యలయం దెల్లను
చరించగ - (నీ పాదము) తిరుగుచుండఁగ
ఘనసమనీల - మేఘముతో సమానమైన నల్లని కాంతి
గలవాఁడా
నిరంజన - పాపహీనుఁడా
నిర్గుణ - హేయగుణములు లేనివాఁడు
కనికరమునగ - మిక్కిలి ప్రేమతో
త్యాగరాజు - త్యాగరాజు
భావింపగ - తలఁచుచుండఁగ
హరిహరి - ఆహా! (నీ దివ్య పాదారవిందము నిష్యవే)

విశేషార్థము :— తత్త్వజ్ఞు లెల్లరును భగవంతుని పాదములనే కొలుచుచున్నారు. బ్రహ్మేంద్రాదులు సయితము భగవంతుని పాదములనే సేవించుచున్నారు. 'సర్వే వేదా యత్పదమామనంతి' అనునటులు వేదములన్నియు వాని పదమునే చెప్పుచున్నవి. కావున ఇంతకు మించిన సత్తువగల పదార్థము మఱియొక టేమిగలదు? 'ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున' అనునటులు చతుర్ముఖ బ్రహ్మాదిపదము లన్నియు నశించునవియే గదా? కావుననే, 'నపరిలషన్తి కేచిదపవర్గమపీశ్వర తే చరణ సరోజహంసకుల సంగ విసృష్టగృహాః' అనునటులు ఉత్తమాధికారులైనవారు భగవంతుని పాదారవిందములయందును తత్కైంకర్యమునందును రుచిగొని మోక్షమును సయిత మపేక్షింపరు. మఱి వారి యభిప్రాయ మేమన్న, 'దివివా భువివా మమాస్తువాసో నరకేవా నరకాన్తక ప్రకామం - అవధీరిత శారదారవిందౌ చరణౌ తే మరణేఽపి చింతయామి' అను నటుల స్వర్గముగాని భూలోకముగాని నరలోకముగాని ఎక్కడైనను సరియే. వారికి స్థానమును గుఱించి విచారములేదు. శరత్కాల తామరస పుష్పములవలె అతి మనోహరమగు భగవంతుని పాద పద్మముల నెడఁబాయక భావించుచున్నం జాలును.

'యస్త్వయా సహసస్వర్గో యస్త్వయా నిరయోవినా' అనునటులు, రామా! నిన్నుఁ గూడుటయే స్వర్గము, నిన్నుఁ బాయుటయే నరకము అని సీత చెప్పినటులు భగవంతుని పాద కైంకర్యము గలిగినదియే పరమపదము. అది లేకున్న, ఆ పరమపదము సయితము వారి కుపేక్షింపఁ దగినదే యని సిద్ధాంతము. ఈ భావములన్నియు, 'హరిహరి! నీయొక్క దివ్య పాదారవింద మియ్యవే' అను వాక్యముచే వెల్లడింపఁబడుచున్నవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప. ; | * | గ రి గా గా గా ; గ రి గా | , - రి గా ; రి | పా ; ; ; | ‖ |
| ; | * | హ రిహ రి నీ ; యొ. క్క | , - ది . ; వ్య | పా ; ; ; | ‖ |
| ; | * | గా , రి సాన్సీ ; సా పా | పమగా | రిసన్సీ - సా ; | ‖ |
| ; | * | దా , రవింద ; మియ్య | వే . . | . . . - . ; | ‖ |
| అ. ; | * | మమామమా - మామా - మాగా | గా - పా ; పా | పా ; పా - ధని | ‖ |
| ; | * | ధ ర ను గ - లు గు - భో . | గ - భా ; గ్య | మె ; ల్ల - ను. | ‖ |
| ధప | * | ,, | ,, | పా ; పాపా | ‖ |
| . . | * | ,, | ,, | మె ; ల్ల ను | ‖ |

; * పనిధాపా - పా ; ధాపా | పమగా ; - పమ | గా ; రిసస్ది ||
; * తథ్య. ము - గా ; దు ను | మి. . ; - శ్రీ. | కృ ; ష్ణ. . ||

; *
; * (హరిహరి)

చ. ; * గరిగాగా - గా ; గాగా | రీ - గామా , గ | రీసా - సాసా ||
; * సనక స - నం ; దన | . - శ్రీనా , . | ర ద - శు కా ||

స్ది * రిగారిసా - సా ; సాస్ది | గా రీ గా ; | ; ; ; ; ||
. * ద్యులమును - లె ; ల్లను | తెంచ . ; | ; ; ; ; ||

; * గరిగాగాగాగా - గా ; | మా ; మగగా | గా ; రీసా ||
; * వనజనయన - బ్ర ; | హ్మా ; ది . సం | క్రం ; దన ||

స్ది * రిగారీ , సా ; - సాస్ది | గారీగా ; | ; ; ; ; ||
. * ఘనులె , ల్ల ; - సే . | విం. చ ; | ; ; ; ; ||

; * గరిగా ; గాగాగా ; | ; మా , మగా | గా ; రీ సా ||

; * మునువే ; దపురా ; | ; ణా , గమ | శా ; స్త్ర . ||

సీ * రిగా రీ , సా ; సాసీ | గారీగా ; | ; ; ; ; ||

. * ములయు , దె ; ల్లచ | రిం. చ ; | ; ; ; ; ||

; * మమాపమా - మా ; గాగా | పా ; పాపా | పా ; పా - ధని ||

; * ఘనసమ - నీ ; లని | రం ; జన | ని ; ర్గు - ణ. ||

ధప * ,, | ,, | పా ; పాపా ||

. . * ,, | ,, | ని ; ర్గుణ ||

; * పనిధాపా - పాపా - పా ; | పా - మా ; పా | గా ; రిసనీ ||

; * కనికర - ముగ - త్యా; | గ - రా ; జు | భా ; వించు ||

; *

; * (హరిహరి)

(ఇతర చరణములను ఇటులనే పాడుకొనవలయును.)



అవతారిక :— ఇందు అయ్యగారు, ఈ సంసారులు సాధారణముగ భగవంతుని తెలియఁజాలరనియు, అట్లు కొందఱు తెలిసికొన్నను, 'యేప్యన్య దేవతా భక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః । తేఽపి మామేవ కౌన్తేయ యజన్త్య విధి పూర్వకం' అనునటులు ఇతర దేవతలను పూజించువారు నయితము ఆస్తికులే; వారును నన్నే పూజించుచున్నారు. అయినను చట్టము నెఱుంగక పూజించుచున్నారు, అని గీతాచార్యులు ప్రసాదించినటులు సులభమగు సిద్ధమార్గము నెఱుంగలేక గర్వులై భక్తిగలవారలై కొందఱు; యోగులము మా కేగతి యని కొందఱు; దొంగభక్తిచే కొందఱు; ఇట్లు పలువురు పలువిధములుగా నుండిరే గాని, నిజమైన భక్తి నెఱింగినవారు లేరుగదా? ఆహా! అట్టివా రెవరురా యని వెదకుచున్నారు.

(28) పున్నాగవరాళి - చాపు.

ప. ఎవరు తెలియఁ బోయెదరు - వివరములేని పూజలు చేసెదరు (ఎ)

చ. ముదమునఁ బరుల సాకలకుఁ బర - పదతుల కాసించి తాము కూఁటకు
నుదరము నింపుటకొఱకుఁ జాల - సారసారఁ గరిగెద రావఱకు (నె)

2. కన్నతొత్తులమాట మీఱలేక - యన్నదమ్ముల తల్లిదండ్రుల నేర
మెన్నలే పనిగాని సారముగఁ - బన్నగశయన నీ పదము నమ్మెదరా (యె)

3. ఆలుబిడ్డలను నమ్మెదరు వారి - కాసించి పరుల * కొంపల బొంకెదరు
కాలునిప్రోలు జేరెదరు అందు - కష్టముఁ జెంది భువిని బుట్టెదరు (ఎ)

4. పెద్దలతోఁ గల్లలాడి రామ - బుద్ధిలేని ధనికులఁ దగ వేఁడి
వద్దన వారితో మోడిచేసి - ప్రొద్దుపోవుట గాని పతితులఁగూడి (యె)

5. ఈసున మరియాద లేదు నిందు - కాసు గల్గినవాని కన్నిట వాసు
ఆస నీయెడఁ గల్గఁబోదు నిజ - దాసులెవరో కనఁ జేతఁగాదు (ఎ)

6. పన్నగ మనకే శక్తి యని - అన్ని కల్లలనుచు దొంగ భక్తి
అన్న యిదేటి విరక్తి రామ - కన్న తండ్రి యిదియా పేతయుక్తి (ఎ)

* 'మూంచెదరు' అని యొకపాఠము.

7. యోగులు మేనెఱుఁగ లేక తమ - కే గతియని ధ్యానింతురుగాక
భోగిశయన యేలుకోక రామ - త్యాగరాజుపై నింత పరాక (యె)

ప్రతిపదార్థము.

ఎవరు - ఎవరు
తెలియఁ బోయెదరు - తత్త్వము నెఱుంగఁగలరు
వివరములేని పూజలు - విమర్శనజ్ఞానములేని పూజలను
చేసెదరు - ఒనర్చెదరు
ముదమునఁ - సంతోషముచేత
పరుల రాకలకుఁ - ఇతరుల రూపాయలకును
పరసుదతులకుఁ - పరస్త్రీలకును
తాము - తమరు
కూడుటకుఁ - చేరుటకై
ఆసించి - ఆశపడి
చాలఁ - బాగుగ

ఉదరము - పొట్టను
నింపుకొనుటకుఁ - పూడ్చుకొనుటకును
ఊరఁ ఊరఁ - ఒక్కొక్క యూరియందును
తిరిగెదరు - సంచరించెదరు
ఆవఱకుఁ - ఆ నిజమైన భక్తిని సంపాదించువఱకును (ఎవరు తెలియబోయెదరు)
కన్నతొత్తులమాట - చూచిన లంజెలమాటను (కంటఁబడిన లంజెలందఱి మాటలను)
మీఱలేక - మించఁజాలక
అన్నదమ్ముల - అన్నదమ్ములయొక్కయు
తల్లిదండ్రుల - తల్లిదండ్రులయొక్కయు

నేరము ఎన్నుటవి - తప్పును గమనించుటయే
పని కాని - పనితప్పు
సారముగఁ - సత్తుగ
పన్నగశయన - శేషశయనా
నీ పదము - నీపాదములను
నమ్మెదరా - పూని తలంచెదరా
ఆలు బిడ్డలను - భార్యా సుతులను
నమ్మెదరు - నమ్ముచున్నారు
వారికిఁ - వారలకు
ఆశించి - ఆశపడి
పరుల కొంపలఁ - ఇతరుల యిండ్లయందు
బొంకెదరు - అసత్యమాడెదరు
కాలునిప్రోలు - యమునియొక్క పట్టణమును
చేరెదరు - చేరెదరు
అందుఁ - అచ్చటను

కష్టము - శ్రమను
చెంది - పొంది
భువిని - భూమియందు
పుట్టెదరు పుట్టుచున్నారు
రామ - రామ
పెద్దలతోఁ - జ్ఞానవృద్ధులతోడను
కల్లలు ఆడి - అబద్ధములు పలికి
బుద్ధిలేని ధనికులఁ - తెలివిలేని ధనికులను
తగఁ - తగునట్లు
వేఁడి - కొనియాడి
వద్దు అనఁగ - కొనియాడవద్దనంగా
వారితోఁ - ఆ ధనికులతోడ
పోడిచేసి - పట్టుపట్టి

పతితులఁ గూడి - పాపాత్ములనుచేరి
ప్రొద్దుప్రోవుటకాని - కాలము గడచుటయే తప్ప
(ఎవరు తెలియ బోయెదరు)
ఈసునఁ - ఈర్ష్యచేత
మరియాద - కట్టు
లేదు - లేదు
నిండుకాసు కలిగినవానికిఁ - ధన మధికముగ నున్న వానికి
అన్నిటఁ - అన్నివిధములచేత
వాదు - అపనింద
ఆస - ఆశ
నీ యెడఁ - నీ విషయమున
కల్గఁబోదు - కలుగఁబోదు
నిజదాసులు - సత్యమైన భక్తి గలవారలు
ఎవరో - ఎవరో

కనఁ - చూచుటకు
చేతఁ గాదు - శక్యము కాదు
(ఎవరు తెలియఁ బోయెదరు)
పన్నుగఁ - స్థిరముగ
మనకుఁ ఏ - మనకే
శక్తి అని - సామర్థ్యమున్నదని
అన్ని - అన్నియు
కల్లలు అనుచును - అబద్ధములని చెప్పుచు
దొంగభక్తి - కపటపు భక్తి
అన్నా - అబ్బా (ఆశ్చర్యార్థకము)
ఇది ఏటివిరక్తి - ఇది యెక్కడి వైరాగ్యము
రామ - రామ
కన్నతండ్రి - నన్నుఁ గన్నవాఁడా
ఇది ఆ - ఇదియా (యుక్తి)
పేదయుక్తి - సత్తులేని యుక్తి (ఎవరు తెలియఁబోయెదరు)

| | |
|---|---|
| రోగులు - రోగులు | రామ - రామా |
| మేను సొలుంగలేక - ఒడలు దెలియక | ఏలుకోక - (నన్ను) కాపాడుకొనక |
| తమకు ఏ - తమకు మాత్రమే | త్యాగరాజునైతే - ఈ త్యాగరాజుమీఁద |
| గతి అని - గతి గలదని | ఇంత - ఇంతటి |
| ధ్యానింతురు కాక - ధ్యానము చేయుచుందురుగాక | పరాకు ఆ - పరధ్యానమా (అజాగ్రత్తయా) |
| భోగిశయన - శేషశయనా | |

విశేషార్థము:—ఇందు ప్రథమచరణము మొదలు నాల్గవ చరణాంతము సంసారుల యొక్క దుఃస్థితిని గూర్చి చెప్పుచున్నారు. ఎట్లన, 'నద్దన్త్యుదిత ఆదిత్యే - నద్దన్త్యస్తమితేరవౌ' అని, సూర్యోదయమైన తోడనే తెల్లవారినదనియు అస్తమయమయిన తోడనే రాత్రి వచ్చినదనియు ఆయా కాలోచిత భోగములకై ఆశపడుచు 'సర్వేజనాః కాంచన మాశ్రయంతి' అనునటులు ఎట్టి అకృత్యములైనం జేసి ద్రవ్యము నార్జింప వలయుననియు, రూకలేనివాఁడు పోఁకచేయుఁడనియు. 'సురూపతైవ వరణీయతా హేతుః' అనునటులు కుల గోత్ర విచారము ఇంచుకయు లేక చక్కదనమును మాత్రమే సాధనముగఁ బెట్టుకొని పరస్త్రీల నాసించుచు, 'ఋణం కృత్వా ఘృతం పిబేత్' అనునటులు అప్పైనం జేసి నెయ్యి త్రాగవలయు

నను చందమున ధర్మాధర్మ విచార మించుకైన లేక యేదియో యొక విధమున పొట్టం బూడ్చుకొనుడు, 'మాతృ దేవోభవ, పితృదేవోభవ' అనునటులు ప్రత్యక్షదేవతలుగ నున్న తల్లిదండ్రులు మొదలగు వారి, ఆప్తుల మాటలను నిరాకరించి 'విటనటగాయక...అను నటులు సర్వోచ్ఛిష్ట భాజనమగు కన్నుతొత్తుల మాటలనే వేదవాక్యములుగ నెంచి మీఱ లేక కొంద ఱుంపుడుకత్తియ, మఱికొందఱు, 'ఋణానుబంధ రూపేణ పశుపత్ని సుతాలయాః' అనునటులు ఋణానుబంధముగ నుండు భార్యాపుత్రులు మొదలగు వారలను సత్యమని నమ్మి వారి పోషణకై పుణ్యపాప విచారము లేక పెద్దలతో నుచితము చెప్పరాని యబద్ధములం జెప్పుచు, ధనికుల నాసించి, 'నీ వింద్రుఁడవు, చంద్రుఁడవు' అని స్తుతించుచు వారు కాలితో చూపి చెప్పిన కార్యములను తలతో వహించి చేయుచు, పాపుల సాంగత్య మొనర్చి యీ లోకమున ప్రొద్దుపుచ్చి జన్మమరణాదిబాధల నొంటుచునుందురు. ఈ రెండు తెగలవారును కేవల సంసారులు. ఇట్టి వీరు తమ యుత్తమగతికై ప్రయత్నింపనే ప్రయత్నింపరు. కావున శ్రీరాముని వీరు తెలిసికొనఁజాలరు గదా అని అభిప్రాయము.

ఇంక ' ఈసున మరియాదలేదు ' మొదలు కీర్తనాంతమువఱకు ఈ సంసారులలోనే భగవద్భక్తులుగ నున్న సామాన్యాధికారులను కొందఱను గుఱించి చెప్పుచున్నారు. ' యస్యాస్తి విత్తం సనరః కులీనః స పండితః స శ్రుతవాన్గుణజ్ఞః । సఏవ వక్తా సచ దర్శనీయః ' అనునటులు ద్రవ్యము గలిగినవాఁ డెవఁడో వాఁడే సత్కులజుఁడు, పండితుఁడు శాస్త్రజ్ఞుఁడు, మంచి నెబ్బరల నెఱింగినవాఁడు, వాచాలకుఁడు, గౌరవింపఁ దగినవాఁడు అను చందమున నెట్టి యప్రయోజకుఁడైనను ధనము గలిగియుండినచో ఖ్యాతిగలదని కాసుపైని మాత్రము ఆసను విడువక భక్తవేషమును గౌరవము కొఱకై వేసికొని నిజముగు భాగవతోత్తముల గమనించలేక తాము శ్రీకృష్ణ వేషమును ధరించిన పౌండ్రక వాసుదేవునివలె దొంగభక్తి గలవారగుటచే తమతోపాటి లెల్లరును దొంగభక్తి గలవార లనుచును, ' శబ్దాదిభోగ నిరత శ్శరణాగతాఖ్యస్త్వత్పాద భక్తఇవ శిష్ట జనౌఘమధ్యే మిథ్యాచ రామి ' అనునటులు తామంతయు నెఱింగినవారి చందముగ ప్రసంగించుచు మనసున లేని శరణాగతుల నొనర్చి మాటలచేత మాత్రము వైరాగ్యమును చూపుచు, శిష్టులుగ నుండు పెద్దలయొక్క సంఘమున తాము

పెద్దల మనిపించుకొనుటకై తిరుగుచుందురు. ఇంతమాత్రమను యుక్తిచేత వీరు పెద్ద లగుదురా? కారు. మఱియుఁ గొందఱు యోగాభ్యాసపరులు నీ పాదారవిందముల నిశ్చల చిత్తులై ధ్యానింతురుగాని వారు తమవలె భగవత్స్వరూపదా వన్యు లెఱుఁగరనియు, తమకే గతి యనియు సాభిమానులై యుందురు. ఇఁక నీ త్యాగరా జన్ననో, పైవి జెప్పిన వారలలోఁ జేరక కేవలము నీకృపకు కాచుకొనియున్నవాఁడు. ఇంతటి యజాగ్రత్త ఎందులకు? కటాక్షింపరాదా. ఇంతియేగాక నిజముగ నీ స్వరూప రూపగుణ విభూతులకు నిన్ను ఆరాధించు ప్రకారములను ఎవ రెఱుఁగగలరు అని భావము.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ప. | సాస | పామా | ‖ ×రీ | సా , ని | ‖ సరీ | గా ; | ‖ , ; | ; ; ‖ |
| | ఎవ | రుతె | ‖ లియ | బో , . | ‖ యొద | రు ; | ‖ , ; | ; ; ‖ |
| | పపా | పాపా | ‖ పా , | ధాపా | ‖ మమా | ధపమా | ‖ ×రీ | సాస్రీ ‖ |
| | వివ | రము | ‖ లే , | నిభూ | ‖ జల | జే. . | ‖ సెద | రు . ‖ |
| చ. | పధా | పాపా | ‖ మగా | రిసస్రీ | ‖ సరీ | గా ; | ‖ , ; | సాసా ‖ |
| | ముద | ముస | ‖ పరు | ల.రూ | ‖ కల | కు ; | ‖ , ; | పర ‖ |

పపా | పాపా ‖ పా , | ధాపా ‖ మా , | పామా ‖ గరీ | సాన్నీ ‖
సుద | తుల ‖ కా . | సించి ‖ తా , | ముఖా ‖ డుట | ను . ‖

మమా | మామా ‖ మగా | గాగా ‖ గమా | పా ; ‖ , ; | పాపా ‖
ఉద | ర ము ‖ నిం . | పు ట ‖ కొఱ | కు ; ‖ - ; | చాల ‖

పా , | పాపా ‖ , పా | ధాపా ‖ పపా | ధ పమా ‖ గగా | రి సన్ని ‖
నూ , | ర సూ ‖ , ర | ది రి ‖ గొద | రా . . ‖ వఱ | ను . . ‖

(ఇతర చరణములను ఇటులే పాడుకొనవలయును.)

---

అవతారిక :— ఇందు అయ్యగారు భగవద్భజనముకన్న భాగవత భజనము చాల శ్రేష్ఠమనియు, 'త్వద్భృత్యభృత్యపరిచారక భృత్య భృత్య భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ' అనునటులు భగవద్దాసులకు దాసులుగ నున్న వారియొక్క భాగ్యమును ఇంతని నిర్ణయించుటకు బ్రహ్మాదులకు సయితము శక్యముగాదనియుఁ దెలిపి, తమ భాగవత నిష్ఠను వెల్లడించుచున్నారు.

(29) పున్నాగవరాళి - చాపు.

ప. ఇంత భాగ్యమని నిర్ణయింప బ్ర - హ్మేంద్రాదుల తరమా (ముని) (ఇం)

అ. చింతనీయ శ్రీరాఘవ నిను మదిఁ - జింతించు సుజనులఁ బూజించినవారి (దిం)

చ. మతిహీనులైన నెమ్మదిలేని వారైన - నతి పాప కృతులైన నెన్నటికి స -
ద్గతిరాని వారైన శ్రీరామ - శ్రుతి పురాణనుత ప్రతిలేని నిను స -
న్నుతిసేయు భక్తుల * జతగూడిన వారి - (దిం)

2. సారెకు మాయ సంసారమందుఁ జాల - దూటినవారైనఁ గామాదులఁ
బూరిత మతులైన సకలవేద - సార నిన్ను మన -
సార నమ్మిన సుధా - పూరచిత్తుల సేవ కోరినవారి (దిం)

3. ధర్మచేల నీదు మర్మము తెలియని - కర్మ మార్గులైనఁ ద్యాగరాజ
ధర్మరహితులైన లోకములు - నిర్మించిన నీదు
శర్మము స్మరియించు - నిర్మల మతుల శర్మమెంచినవారి (దిం)

* 'జతగూడిన' అను దానిలో 'శతగూడిన' అని యొక పాఠాంతరము.

## ప్రతిపదార్థము.

మునిచింతనీయ శ్రీరాఘవ - మునులచే ధ్యానింపఁబడు శ్రీరామా
నినుꣳ - నిన్ను
మదిꣳ - మనసునందు
చింతించు సుజనులꣳ - ధ్యానించు భక్తులను
పూజించిన వారిది - పూజ చేసినవారిది
భాగ్యము - అదృష్టము
ఇంత అని - ఇంత మాత్రమని
నిర్ణయింప - నిరూపించుటకు
బ్రహ్మేంద్రాదుల తరము ఆ - బ్రహ్మయుఁగాని ఇంద్రుఁడు మొదలగువారికిఁగాని శక్యమా ?
మతిహీనులైనꣳ - బుద్ధిలేని వారైనను
నెమ్మదిలేని వారైనꣳ - స్థిరచిత్తములేని వారైనను
అతి పాపకృతులైనꣳ - మిక్కిలి పాపముచేసిన వారైనను
ఎన్నటికిꣳ - ఎప్పటికిని
సద్గతి రానివారు అయినꣳ - మోక్షముఁ బొందఁదగనివారుగ నున్నను
శ్రుతిపురాణనుత - వేదపురాణములచేత కొనియాడఁబడు
శ్రీరామ - శ్రీరామా
ప్రతిలేని నినుꣳ - సాటిలేని నిన్ను
సన్నుతిసేయు భక్తుల జతగూడినవారిది - స్తోత్రము చేయునట్టి భాగవతులతోఁ జేరినవారిది
(ఇంత భాగ్యమని నిర్ణయించుటకు ఎవరికి శక్యమని భావము)

సారెకున్ - మాటికిని

మాయ సంసారమంబునన్ - మోసపు సంసారమున

చాలన్ - మిక్కిలి

తూటినవారు అయినన్ - ప్రవేశించిన వారైనప్పటికిని

కామాదులన్ - కామాదులచే

పూరితమతులు అయినన్ - నింపఁబడిన మనస్సుగల వారైనప్పటికిని

సకల వేదసార - సమస్త వేదములయొక్క సత్తుగ నున్నవాఁడా

నిన్నున్ - నిన్ను

మనసారన్ - మనస్సు నిండుగ

నమ్మిన సుధాపూర చిత్తులసేవ - నమ్మినట్టి అమృత ప్రవాహమువంటి మనస్సుగల భాగవతులయొక్క సేవను

కోరినవారిది - అసగొన్నవారిది

(భాగ్యము ఇంతని నిర్ణయించుటకు ఎవరి తరమని భావము)

ధర్మచేల - బంగారు వస్త్రముగలవాఁడా

నీదుమర్మము - నీయొక్క గుట్టును

తెలియని కర్మమార్గులైనన్ - ఎఱుంగని కర్మానుష్ఠానపరులైనప్పటికిని

త్యాగరాజ ధర్మరహితులు అయినన్ - త్యాగరాజుచే ననుష్ఠింపఁబడు ధర్మముగ నున్న భక్తి ప్రపత్తులు లేని వారలైనను

లోకములన్ - లోకములను

నిర్మించిన నీదు కర్మము - పుట్టించినట్టి నీయొక్క గుణానుభవముచే గలుగు సుఖమును

స్మరియించు నిర్మల మతుల కర్మము - ధ్యానించునట్టి మంచి మనస్సుగల భాగవతులయొక్క ఆనందమును

ఎంచినవారిది - తలంచినవారిది

విశేషార్థము:—ఇందు పంచమోపాయ మను పేరుగల భాగవత నిష్ఠను వెల్లడిచేయు చున్నారు. భగవన్నిష్ఠ గలుగుట యెల్లరకును సులభసాధ్యమనియు, తనువలె కరచరణాదులతోఁ గూడి ఆహార నిద్రాది వ్యవహారములు గలవారై యుండుటచే మనుజులకు భాగవతులయందు సామాన్య ప్రతిపత్తి గలుగునుగాని విశేషభక్తి గలుగుట దుర్లభమనియు; అట్టి నిష్ఠను సంపాదించిన వారల భాగ్యమును నుడువ బ్రహ్మాదులకును శక్యము కాదనియు; నుడువు చున్నారు. 'అతి పాపకృతులైన నెన్నటికి సద్గతిరాని వారైన', 'శ్రుతిపురాణనుత ప్రతి లేని నిను సన్నుతిసేయు భక్తుల జతకూడినవారు' అనుటచే, 'న తత్సమశ్చా భ్యధికశ్చ దృశ్యతే' అనునటులు సమానుఁడును అధికుఁడును లేని భగవంతుఁడు 'తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతి పూర్వకమ్। దదామి బుద్ధియోగం తం' అనునటులు తన్ను భజించువారికి బుద్ధిబలము నధికముగ నిచ్చి వారిచే సత్కార్యములను జేయించి పదవి నిచ్చుచున్నాడనియు, అట్లు కానివారిని, 'క్షిపామ్యజస్ర మశుభా నాసురేష్వే వయోనిషు' అనునటులు రాక్షసయోనులందుఁ బుట్టించి వారిచే దుర్మార్గపు పనులను చేయించుననియు,

నిట్టి పుణ్యపాప విచారమొనర్చుచు, ఈ శాసనమును మార్చుటకుఁగాని, వలదని చెప్పుటకుఁగాని యెవ్వరికిని శక్తిలేదనియు, ఇందుచే, 'పునర్దరిద్రః పునరేవ పాపీ' అనునటులు దారిద్ర్యము వల్ల పాపమును, పాపమువలన దారిద్ర్యమును గలుగుచున్నవనియును, ఇట్టి యెడతెగని పాపముఁగల వీరికి యెన్నటికిని సద్గతి గలుగకుండవచ్చుననియును, ఆనుషంగిక, ప్రాసంగిక సుకృతములలో దేనినైన గమనించి పురుషార్థము నియ్యవలెనను తలంపు గలిగియుండు భగవంతు నాశ్రయించి కృతార్థులై వెలయుట శ్రమసాధ్యమనియును భావము.

'భక్తిక్రీతో జనార్దనః' అనునటులు, భగవంతుఁడు భక్తులయొక్క భక్తికి నమ్ముఁడు వోయి, 'ధనం మదీయం తవ పాదపంకజమ్' అనునటులు తన పాదారవిందములను సయితము భక్తునియొక్క మూలధనముగ నేర్పఱచి కృపావశ్యుఁడై, అన్యులు తనకెంత యపకార మొనర్చినను సహించుచు, 'మద్భక్తం శ్వపచం వాపి నిన్దాం కుర్వన్తి యే నరాః। కల్ప కోటిశతేనాపి నక్షమామి కదాచన' అనఁగా నా భక్తుఁడు కుక్కమాంసము తినువాఁడైనను

వానిని నిందించినయెడల నే నోర్చను; కోటికల్పాంతములకైనను వానిచే పాపముల ననుభవింపించియే తీరుదును; అనునంతటి ప్రీతికలవాఁడై స్వాతంత్ర్య మంతయు నుడిగింపఁ జేసికొని భక్తులకు సర్వస్వాతంత్ర్య మొసంగియున్నాఁడు. కావున అట్టి భక్తుల నాశ్రయించిన యెడల నెట్టి సంసారులైనను సులభముగ మోక్షము నొందఁగలరు. ఆ భక్తులును గుణదోష విచారము చేయక తల్లివలె కేవల ప్రీతిపరులై తమ్మునాశ్రయించిన వారిని కటాక్షించు చున్నారు. కాఁబట్టి భగవంతునివలన కాఁజాలని కార్యముగూడ భాగవతులవలన సులభముగా నెఱవేఱుచున్నది. అట్టి భాగవతుల నాశ్రయించినవారి భాగ్యమే భాగ్యముగాని భగవంతుని నాశ్రయించిన వారి భాగ్యము నయితము అంత గొప్పదిగాదని అయ్యగారు సూచింపుచున్నారు.

అనఁగా 'యద్వా భాగవతాభిమానవసతి' అనునటులు, మనుజుఁడు స్వశక్తిచేత సాధింపఁదగిన ధర్మానుష్ఠానము లన్నియుఁ బోయినవాఁడై యచేతనమువలె నత్యంత పార

తంత్రియము గలిగి యుండినఁగాని యొక భాగవతుని గొప్ప చేసి శరణు పొందఁడు; ఇట్టి జ్ఞానమును సంపాదించుటయే సమస్త శాస్త్రముల తాత్పర్యము; కావున చూపులకు నిది సులభముగ నున్నను అనుష్ఠానమున భగవన్నిష్ఠకన్న చాల గొప్పదియని యెఱుంగవలయును.

ప. , * గా | మాపా || , పా | పాపా || , - మా | పాధప || పధమ | గరిసా ||
, * ఇం | త భా || , గ్య | మ ని || , - ని | ర్జ . యిం || ప . . | ... ||

ని * సా | సా - పా || , పా | ప నిధా || ప - మా | ,, || ,, | గరిసా ||
. * ఇం | త - భా || , గ్య | మని . || . - ని | ,, || ,, | బ్రం . . ||

ని * రి గ | రీ సా | స నీ | సరిగరి || గా . | ; - ధప || మగరి | సా ; ||
. * స్త్రేం | బ్రా , || దుల | త . ర . || మా , | ; - . . || ... | . ; ||

ని *
, * (ఇంత భాగ్య)

అ. , * మా | మామా ‖ , ; | మగగా ‖ , - గా | మాపా ‖ , ; | ప నిధా ‖
, * చిం | త నీ ‖ , ; | య. శ్రీ ‖ , - రా | ఘు వ ‖ , ; | ము. ని ‖

ప * ,, ‖ పపా | పనిధా ‖
. * ,, ‖ ని సు | మ. ది ‖

ప * గా | గాగా ‖ గపా | ధపధా ‖ , - పా | పాధప ‖ ధ పమ | గరిసా ‖
. * చిం | తించు ‖ సు జ | ను. ల ‖ , - బూ | జిం , ‖ చి న . | వారి. ‖

ని *
. * (దింత భాగ్య)

చ. , * గగ | గాగా ‖ గా , | గాగా ‖ గగా ‖ పమగా ‖ గ రి | సాస్ని ‖
, * మతి | హీను ‖ లై , | న నె ‖ మ్మది ‖ జే . ని ‖ వా. | లై న ‖

, * రిగ | రీసా ‖ స స్ని | స రిగరి ‖ గా , ‖ ; - పా ‖ మగా | రిసస్ని ‖
, * అతి | పాప ‖ కృతు | లై... ‖ న , ‖ ; - ఎ ‖ న్నటి | కి . స ‖

, * రిగ | రీసా ‖ రి స్నీ | స రిగరి ‖ గా , | ; – ధప ‖ మా , | గ రిసనీ ‖
, * ద్గతి | రాని ‖ వా. | రై... ‖ న , | ; – శ్రీ. ‖ రా , | మ... ‖

, * మమ | మామా ‖ , మా | మగగా ‖ , గగ | మాపా ‖ పపా | పా ; ‖
, * శ్రుతి | పు రా ‖ , ణ | ను . త ‖ , ప్రతి | లే ని ‖ ని ను | స ; ‖

, * మగ | గాగా ‖ గామా | ధపధా ‖ , పప | పాధప ‖ ధపమ | గ రిసనీ ‖
, *స్నుతి | నేయు ‖ భ . | క్తు. ల ‖ , జత | గూడి. ‖ న . . | వా. రి . ‖

, *
, * (దింత భాగ్య)

(ఇతర చరణములును ఇటులే పాడుకొనవలయును.)



అవతారిక:—ఇందు అయ్యగారు శ్రీరామచంద్రుని స్తోత్రముచేసి భజనము చేయుచున్నారు. (ఇందుఁగల తెనుఁగు చరణములు అయ్యగారి రచనముకాదు. ఇది దివ్యనామ సంకీర్తనము కనుక నెవరో యీ చరణములను వ్రాసి చేర్చినారని తోఁచుచున్నది.)

## (30) పున్నాగవరాళి - చాపు.

ప. తవదాసోహం తవదాసోహం - తవదాసోహం దాశరథే (త)

చ. వరమృదుభాష విరహితదోష - నరవరవేష దాశరథే (త)

2. సరసిజనేత్ర పరమపవిత్ర - సురపతిమిత్ర దాశరథే (త)

3. నిన్నుఁ గోరితిరా నిరుపమశూర - నన్నేలుకోరా దాశరథే (త)

4. మనవిని వినుమా మఱవ సమయమా - ఇనకుల ధనమా దాశరథే (త)

5. ఘనసమనీల మునిజనపాల - కనకదుకూల దాశరథే (త)

6. ధర నీవంటి దైవము లేఁడంటి - శరణనుకొంటి దాశరథే (త)

7. ఆగమవినుత రాగవిరహిత - త్యాగరాజనుత దాశరథే (త)

### ప్రతిపదార్థము.

దాశరథే - దశరథరామా

అహం - నేను

తవదాసః - నీదు దాసుఁడను

వరమృదుభాష - శ్రేష్ఠమైన మెల్లనిమాటలు గలవాఁడా

విరహితదోష - దోషము లేనివాఁడా
నరవరవేష - శ్రేష్ఠమైన మానుష వేషముదాల్చిన వాఁడా
దాశరథే - దశరథరామా
సరసిజనేత్ర - తామర రేకులవంటి నేత్రములు గల వాఁడా
పరమపవిత్ర - మిక్కిలి పరిశుద్ధమైనవాఁడా
సురపతిమిత్ర - ఇంద్రునకు స్నేహితుఁడా
దాశరథే - దశరథరామా
నిరుపమశూర - సమానములేని శౌర్యముగలవాఁడా
నిన్నుఁ గోరితిరా - నిన్ను వలచియున్నానురా
దాశరథే - దశరథరామా
నన్నేలుకోరా - నన్ను కాపాడురా
దాశరథే - దశరథరామా

ఇనకులధనమా - సూర్యకులముయొక్క భాగ్యమా
మఱవ సమయమా - మఱచుటకు సమయమా
(కాదు. కనుక)
మనవిని వినుమా - నా మనవి నాలకింపుమా
ఘనసమనీల - మేఘమువంటి నల్లని శరీరముగలవాఁడా
మునిజనపాల - మునిజనములను పాలించువాఁడా
కనకదుకూల - బంగారు చేలమును ధరించినవాఁడా
దాశరథే - దశరథరామా
ధరలో - భూమియందు
నీవంటిదైవము - నీసరివేల్పు
లేదంటిని - లేదంటిని (కావున)
దాశరథే - దశగథరామా
శరణనుకొంటిని - నిన్నే శరణు చొచ్చితిని
ఆగమవినుత - వేదాగమములచేత నుతింపఁబడినవాఁడా

రాగవిరహిత - రాగద్వేషములు లేనివాఁడా　　దాశరథే - దశరథరామా

త్యాగరాజనుత - త్యాగరాజుచే నుతింపఁబడినవాఁడా

ప. ; * గరిగా ; గా ; గా ; | గారిగా ; | గా ; గా ; ||
; * తవదా ; సో ; హం ; | త వదా ; | సో ; హం ; ||

; * పపపా ; పా ; ధాపా | పాధాపామా | గారిసాన్ని ||
; * తవదా ; సో ; హం . | దా . శ ర | థే ... ||

; * ని̣ని̣ని̣ ; ని̣ ; ని̣ ; | సాసాసా ; | సా ; సా ; ||
; * తవదా ; సో ; హం ; | త వ దా ; | సో ; హం ; ||

; * పపపా ; పా ; ధాపా | మాధాపామా | గారిసాన్ని ||
; * తవదా ; సో ; హం . | దా . శ ర | థే ... ||

; * గరిగాగాగా ; గా ; | గారిగాగా | గా ; గా ; ||
; * వరమృదుభా ; షా ; | వి రహి త | షో ; షా ; ||

; * పపపాపాపా ; ధాపా | మా ; పామా | గారీసాస్నీ ||
; * సర వర వే ; షా . | దా ; శ ర | ధే . . . ||

; *

; * (తవదాసోహం)

(ఇతర చరణములును ఇటులే పాడుకొనవలయును.)

అవతారిక:—ఈ కీర్తనయందు, అయ్యగారు శ్రీరాములవారిని సంబోధనము చేసి, తాము ఉత్తమగతినిఁ బొందుటకైన కార్యము లేమియునుం జేయక దినములను వ్యర్థముగఁ గడపినాఁడనని యును, అట్లు తానుచేసిన యపరాధములను మన్నించి తన్ను కాపాడవలయుననియు ప్రార్థించు చున్నారు.

## (31) పున్నాగవరాళి . చాపు.

ప. పాహి కల్యాణ సుందర రామ మాం (పా)

చ. చదివిన వాఁడనుగాను రామ - ఇది బుద్ధియనుచుఁ దెలియఁగలేను (పా)

2. భజియించుటకు బుద్ధిలేక రామ - బతిమాలి తిరిగితి నిందాఁక (పా)

3. దినదిన ముదరముకొఱకు రామ - ధనికులఁ గాచితి నీవఱకు (పా)

4. ఆలు సుతులపైని ప్రేమ నీ ప - జాల నుంచగఁనైతి రామ (పా)

5. సంసారసుఖము సతమని నామ - సార మెఱుఁగ మఱచితిని (పా)

6. విషయాదులను రోయలేక విజ్ఞ - వీఁగి మోసపోతి నిందాఁక (పా)

7. నేరమెంతో చేసితిని ఏమి - నేరమనుచు వేఁడితిని (పా)

8. శుకసన్నుత నన్నుఁ గన్నతండ్రి - యొకసారి శరణనుకొన్న (పా)

9. తమ్మికన్నుల రఘువీర నిను - నమ్మితి నన్నేలుకోర (పా)

10. నిను నమ్మువారలకు మేలు చాలు - నీపాదసేవ వెయివేలు (పా)

11. సాకేతరామ నామీఁద దయ - లేకుండుటిది మరియాద (పా)

12. శరణ్య కోసలరాజ రామ - పరిపాలిత త్యాగరాజ (పా)

## ప్రతిపదార్థము.

కల్యాణ సుందరరామా - అనంతకల్యాణ గుణములతోఁ గూడుకొన్న అందమైన శ్రీరామా
మామ్ - నన్ను
పాహి - కాపాడుము
రామ - శ్రీరామా
చదివిన వాఁడను కాను - నేను చదువులు నేర్చినవాఁడను కాను
ఇది బుద్ధియనుచుఁ - ఇది మంచిదియని
తెలియఁ లేను - ఎఱుఁగలేను
భజియించుటకుఁ - నిన్ను భజనముచేయుటకు
బుద్ధిలేక - జ్ఞానము లేనివాఁడనై
బతిమాలి - ప్రయోజనములేక
ఇందాఁకఁ - ఇంతవఱకును
తిరిగితిఁ - అల్లాడితిని
దినదినము - ప్రతి దినమును
ఉదరముకొఱకుఁ - కడుపు నింపుటకై
ఈవఱకుఁ - ఇంతవఱకును
ధనికులఁ కాచితిఁ - ద్రవ్యము గలవారలను కాచియుంటిని
రామ - శ్రీరామ
ఆలుసుతులపైని ప్రేమ - భార్య బిడ్డలపైని ప్రేమను
నీ పదాలఁ - నీ పాదములయందు
ఉంచఁ ఐతిని - పెట్టకపోతిని
సంసారసుఖము - ఈ సంసారమునందలి (తుచ్ఛ) సుఖమును
సతము అని - నిత్యమని తలఁచి

నామసారముఁ - నీనామ భజనమునందలి రుచిని

ఎఱుఁగఁ - తెలిసికొనుటకు

మఱచితిని - మఱచిపోతిని

విషయాదులను - కామాదులను

రోయలేక - తొలఁగించుకొనలేక

విఱ్ఱవీఁగి - మహతఁజెంది

ఇంచాకఁ - ఇంతవఱకును

మోసపోతిఁ - మోసపోతిని

నేరము - అపరాధము

ఎంతో చేసితిని - ఎంతయో చేసితిని

ఏమి నేరమనుచుఁ - నేనేమి తప్పులు చేసితినని

వేఁడితిని - ప్రార్థించుకొంటిని

శుకసన్నుత - శ్రీ శుకునిచేత నుతింపఁబడినవాఁడా

ననుకన్నతండ్రి - నను(గన్నతండ్రీ

ఒకపారి - ఒకసారియైనను

శరణు అనుకొన్నఁ - శరణు చొచ్చితిని అనిన నన్ను (కాపాడరాదా)

తమ్మికన్నుల రఘువీర - తామర రేకులవంటి కన్నులుగల రఘువీరుఁడా

నిన్నుఁ - నిన్ను

నమ్మితిఁ - నమ్మినాను

నన్నేలుకోర - నన్నేలు కొనుము

నిన్నుఁ - నిన్ను

నమ్మువారలకు - నమ్మువారలకు

మేలు - క్షేమము

రామా - శ్రీరామా

నీ పాదసేవ - నీ పదారవిందసేవ

వెయివేలు - అనంత సంపదలు

చాలున్ - సమృద్ధి
సాకేతరాను - సాకేతరాముఁడా
నామీఁదన్ - నామీఁదను
ప్రేమ లేకుండుటయిది - ఇట్లు కరుణమాలి యుండుట
మరియాద - ధర్మము

శరణ్య - రక్షకుఁడా
కోసలరాజ - కోసల దేశాధిపుఁడా
పరిపాలిత త్యాగరాజ - పరిపాలింపఁబడిన త్యాగరాజు గలవాఁడా
రామ - శ్రీరామా!

విశేషార్థము:—ఇందు, 'చదివిన వాఁడనుకాను' ఇత్యాదులచే అయ్యగారు, శ్రీరామ! నేను చదువులేనివాఁడనుగాన జ్ఞానము నెటులు సంపాదింపఁగలను. నీవు కృపాసముద్రుఁడవై నన్ను పాలించినంగాని నేను కడతేరుటకు మఱియొక యుపాయము లేదనుచున్నారు. 'దినదిన ముదరములకొఱకున్' ఇత్యాదులచే, శ్రీరామా! నేను భార్యబిడ్డలయం దాసచే ధనికులను గాచి యుండి ద్రవ్యము నార్జించుచుంటినిగాని నినుఁ బొందుటకై యొక మంచికార్యము నైనను చేయ లేదు. ఇట్టి నన్ను ఎటులు ప్రోచెదవో? అనుచున్నారు.

'నేరమెంతో చేసితిని' ఇత్యాదులచే, శ్రీరామా! నేను అనేక దుష్టకార్యములను చేసినది మాత్రమే గాక, నేనేమి తప్పుచేసితిని? అని సర్వజ్ఞుఁడవగు నియొద్దనే కల్లలాడితిని. ఇట్టి అపరాధి నగు నన్ను నీవు కృపావశుఁడవై కాపాడవలయునే గాని వేఱొక యుపాయము లేదనుచున్నారు.

'శుకసన్నుత' ఇత్యాదులచే, శ్రీరామా ! నేను ఇదివఱకును నిన్ను స్మరింపకయే యుండినను, నీవే రక్షకుండ వని యెఱింగి ఇదిగో శరణాగతి చేసితిని. శరణాగతి చేసిన వానిని కాపాడుట నీసు సంకల్పము. అట్లుండు నపుడు నాతప్పులను గమనింపక నీ సంకల్పమును గమనించి నన్ను కాపాడ వలయు ననుచున్నారు.

ప. , * గా | గాగా || గా, | గాగా || రిసా | రి గరి || గరి | గా ; ||
, * పా | హి క || ల్యా, | ణ సుం || ద ర | రా. . || మ. | మాం; ||
, * గమ | పాపా || పా , | ధాపా || మమా | ధ పమా || సాన్ని | సాన్ని ||
, * పా. | హి క || ల్యా, | ణ సుం || ద ర | రా. . || మ. | మాం ||
చ. , * గగ | గాగా || గాగా | గ రి || గ రి | గా ; || , ; | గాగా ||
, * చది | వి న || వాడ | ను . || గా. | ను ; || , ; | రామా ||
, * పప | పాపా || పా , | ధాపా || మమా | మధపా || గరి | సాన్ని ||
, * ఇది | బుద్ధి || య , | ను చు || దెలి | య. గ || లే. | ను . ||

(ఇతర చరణములును ఇటులే పాడుకొనవలయును.)

అవతారిక:— ఈకీర్తనయందు, అయ్యగారు, శ్రీరామచంద్రునియొక్క దివ్యమంగళ విగ్రహమునందలి సౌన్దర్యములు అపరిమితము లనియు, ఒక్కొక్క అవయవ సౌందర్యమును జూచువారు ఆ సౌందర్యమును పూర్తిగ ననుభవింపఁజాలక యా సౌందర్య సముద్రమునందు మునిఁగి పోవుటవల్ల మఱియొక అవయవ సౌందర్యమును జూచుట కశక్తు లగుచున్నారనియును చెప్పి, శ్రీ సీతాలక్ష్మణభరతశత్రుఘ్నాంజనేయుల యనుభవమును నుదాహరణముగఁ జూపుచున్నారు.

(32) అసావేరి - ఆది.

ప. † లేకయా నిన్నుఁ జుట్టుకొన్నారు - ఏకహృదయులై నిత్యానందము (లే)

అ. శ్రీకర కరుణాసాగర నిరుపమ - చిన్మయా శ్రితచింతామణి నీయెడ (లే)

చ. సౌందర్యములలో సుఖము సీతమ్మకు - సౌమిత్రికి కనుల జాడల సుఖము తే

† 'లేకనా' అను పాఠము గ్రామ్యము.

2. సుందరముఖమున సుఖము భరతునికి - సుజ్ఞాన రూపమున సుఖము రిపుఘ్నునికి (లే)

3. చరణ యుగమునందు సుఖమాంజనేయునికి - వరగుణ త్యాగరాజ వరదఆనందము (లే)

## ప్రతిపదార్థము.

శ్రీకర - సంపత్కరుఁడా
కరుణాసాగర - దయాసముద్రుఁడా
నిరుపమ - సమానము లేనివాఁడా
చిన్మయా - జ్ఞానస్వరూపుఁడా
శ్రిత చింతామణీ - ఆశ్రయించినవారికి చింతామణీ వలె సకల కోర్కెల నొసంగువాఁడా
నీయెడఁ - నీయొద్ద
ఆనందము - నిత్యమైన ఆనందము
లేకయా - లేకయా
ఏకహృదయులై - ఏకచిత్తము గలవారలై

నిన్నుఁ - నిన్ను
చుట్టుకొన్నారు - ఆశ్రయించుకొని యున్నారు
సీతమ్మకుఁ - సీతాదేవికి
సౌందర్యములలోఁ - నీదు సౌందర్యములన్నిటియందు
సుఖము - ఆనందము
సౌమిత్రికిఁ - లక్ష్మణునికి
కనుల జాడలలోఁ - కంటి జాడలలో
సుఖము - ఆనందము
భరతునికిఁ - భరతునికి
సుందర ముఖమునఁ - అందమైన ముఖమునందు

సుఖము - ఆనందము
రిపుఘ్నునికిఁ - శత్రుఘ్నునికి
సుజ్ఞాన రూపమునఁ - జ్ఞాన స్వరూపమునందు
సుఖము - ఆనందము
ఆంజనేయునికిఁ - హనుమంతునికి
చరణయుగమునందుఁ - నీదు చరణయుగమునందు

సుఖము - ఆనందము
వరగుణ - మంచిగుణములు గలవాఁడా
త్యాగరాజవరద - త్యాగరాజునకు వరముల నిచ్చువాఁడా
ఆనందము - ఆనందము
(లేకయా నిన్నుఁ జుట్టుకొన్నారు)

విశేషార్థము.—ఈకీర్తనయొక్క అను పల్లవియందు, శ్రీకర, కరుణాసాగర, నిరుపమ, చిన్మయా, శ్రిత చింతామణీ, అను విశేషణపదములచే, సీత, లక్ష్మణుఁడు, భరతుఁడు, శత్రుఘ్నుఁడు, ఆంజనేయుఁడు అను నీ యైదుగురును క్రమముగానమనుభవించుచు నానందమును సూచింపుచు వానిని కీర్తనయొక్క చరణములందు విమర్శించుచున్నారు.

'సౌందర్యములలోఁ' ఇత్యాదుల, 'కన్యావరయతే రూపం' అనగా, నొకకన్యక తనకు నాథుఁడుగ నుండువాఁడు అందగాఁడుగా నుండవలయునని కోరుట సహజముగ నున్నది. కనుక, సీతాదేవి యును శ్రీరాముని సౌందర్యములయందు మిక్కిలి ఆనందము గలిగినదియై ఆ యానంద సముద్రము

నందు మునికి తేలుచున్నదని భావము. ఇందు కుదాహరణముగ అశోకవనికయందు సీతాదేవి హనుమంతునిగూర్చి శ్రీరాముల యోగక్షేమములను విచారింపఁ బూనినపుడు, ముఖ్యముగ విచారింప వలసిన యనేక విషయము లుండఁగ, 'రూపం రామస్య కీదృశమ్ । కథమూరూ కథం బాహూ' అనఁగా శ్రీరాముని సౌందర్య మెట్టిది ? వారి తొడలును, భుజములును, ఎట్లుండును ? అని శ్రీరామ సౌందర్యములను గూర్చియే మొట్టమొదట కుశల ప్రశ్నముచేసెను. అందుచేత సీతాదేవికి శ్రీరామ సౌందర్యముల ననుభవించుటకన్న మేలైన యొక ఆనందము లేదని భావము.

'సౌమిత్రికి కనులజాడల సుఖము' అనుటచే లక్ష్మణుండు సదా శ్రీరామ కైంకర్యముననందే ఆసక్తి గలిగి యుండువాఁడగుటచే ఏ సమయమున నేకార్యమును జేయుటకై శ్రీరాముఁడు కనుగీటునో యని శ్రీరాముని కనుజాడను జూచుచు నానందించు చున్నాఁడని భావము.

'సుందర ముఖమున సుఖము భరతునికి' అనుటచే, భరతుఁడు దనకు లభించిన రాజ్యమును తా ననుభవింపనోపక శ్రీరామునికే సమర్పించి, శ్రీరాముఁడు రత్నమయమైన సింహాసనమునందు కొలు వమరియుండు తఱి నతని ముఖారవింద సేవను జేయవలయునను సంకల్పముతో పదునాలుగు

సంవత్సరములు నితయ వ్రతుఁడై యుండి అటులే శ్రీరాముని పట్టాభిషేకముగాంచి శ్రీరామచంద్ర ముఖారవింద సేవా దురంధరుఁడై యుండి పరమానందము ననుభవించెనని భావము.

'సుజ్ఞాన రూపమున సుఖము రిపుఘ్ననికి' అనుటచే, శత్రుఘ్నుఁడు, 'శత్రుఘ్నో నిత్య శత్రుఘ్నః' అనఁగా నిత్య శత్రువులైన కామక్రోధాదులను జయించి, 'విజ్ఞానఘనః ప్రజ్ఞాన ఘనః' అను నటులు భగవంతునియొక్క జ్ఞానానంద స్వరూపము ననుభవించువాఁడు కావున, వాఁడు స్వరూపానంద సుఖము ననుభవించు చున్నాఁడనిభావము.

"చరణయుగమునందు సుఖమాంజనేయునికి' అనుటవల్ల, 'శవామృతస్యందిని పాదపంకజే నివేశితాత్మాకథ మన్యదిచ్ఛతి' అను నటులు, దేవామృతమునకుఁ దుల్యమగు శ్రీరామచంద్ర పాదారవిందముల నాశ్రయించినవాఁడు మఱియొక వస్తువుసం దానంద మున్నదని తలఁచునా ? అటులే శ్రీరాముని పాదయుగము నాశ్రయించి ఆంజనేయుఁడు సదానందానుభవిగ నున్నాఁడనిభావము.

అసావేరి రాగలక్షణము:—ఈ రాగము 8-వ మేళమైన హనుమతోడియందు జన్యము. ఔడవ సంపూర్ణరాగము. అవరోహణమును సంపూర్ణముగను వక్ర సంపూర్ణముగను పాడుట

వాడుకలో నున్నది. శుద్ధ ఋషభ సాధారణ గాంధార శుద్ధ ధైవతములు రాగాచ్ఛాయా స్వరములు. ఆరోహణమునందు గాంధార నిషాదములు వర్జింపఁ దగినయవి. ఎల్లప్పుడును గానము సేయఁదగినది. 'గరిమా' అను ప్రయోగమునందు చతుశ్శ్రుతి ఋషభము కొన్ని సందర్భముల యందు పలుకును.

17

| ఆరోహణము. | అవరోహణము. |
|---|---|
| స రి మ ప ధ స | 1. స ని ధ ప మ గ రి స. |
| | 2. స ని స ప ధ మ ప రి గా రి స. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప. ; | * | రీ ; మా - పా ; - ధపధా | ; - మపప ధపా | మా , గగరిసా | ‖ |
| ; | * | లే ; క - యా ; - నిన్న | ; - జు. ట్టు. కొ | న్నా, ...రు | ‖ |
| ; | * | రిమరీమా - పా ; - ధపధా | ,, | మా ; - పాధప - మపమగ | ‖ |
| ; | * | లే. . క - యా ; - ని .న్న | ,, | నా ; - ... - . . రు. | ‖ |
| రిస | * | ,, | ; - సనీ సపా | ,, | ‖ |
| . . . | * | ,, | ; - జు. ట్టుకొ | ,, | ‖ |

రిస * గారీమా - పా ; - పధస్సా | ,, | ,, ||

. . * లే . క - యా ; - ని . న్న | ,, | ,, ||

రిస * గారీమా - పా ; - పాధాసరిగ్గా | రిసా - సనీస పా | మాపానినిధప - మపగా ||

. . * లే . క - యా ; - ని . న్న . | . . . - జు.ట్టుకో | న్నా . . . . . - . . ద ||

రిస * రిగారిసా - సరి స్ని సా ; | ; - రిమపా ; | మా ; పధపా - మపగా ||

. . * ఏక .హృ - ద. యులై ; | ; - ని . త్యా ; | నం ; . . . - ద . ము ||

రిస * ,, | ; - రిమ పధస్సా | నిసపధ - మపగా ||

. . * ,, | ; - ని . త్యా . | నం . . - ద . ము ||

రిస * ,, | ; - రిమ పా ; | మా , గ - గరిసా ||

. . * ,, | ; - ని . త్యా ; | నం , . - ద. ము ||

; *

; * (లేకయా)

అ. ; * పమాపధా - సాసారిసా | ; - రిగారిసా | రిసరిని - సాసప ||

; * శ్రీ . కర - కరుణా. | ; - సా. కర | ని . రు. - ప . మ ||

; * మా , పధా - సాసాగరిగా | ,, | ,, ||

; * శ్రీ , కర - కరు .ణా . | ,, | ,, ||

; * ,, | ; - గరిమగరిస | ,, ||

; * ,, | ; - సా. క . ర . | ,, ||

; * పా , ప పా - రిపమ - ధపధా | ; - ప ధనిధపా | ; ; - ; ; ||

; * చి , న్మయా - శ్రి.త - చిం . | ; - తా.మణి . | ; ; - ; ; ||

; * ,, | ,, | ; ; - గరిమప ||

; * ,, | ,, | ; ; - . . . . ||

రిస * పా , ప పా - గరిమా - పధసా | ,, | మా ; పాధప - మ పగా ||

. . * చి , న్మయా - శ్రి.త - చిం . | ,, | నీ ; . . . - యెం. ద ||

రిస * పా , ప పా - రిమపధ - సారిగరిసా | ; - స నీసపా | ,, ||
. . * చి , న్మయా - శ్రి. త. - చిం . . . | ; - తా .మణి | ,, ||
రిస *
. . * (లేకయా)

చ. ; * పమాపధా - సాసారిసా | ; - రిగారిసా | రిసరిని - సాసా ||
; * సౌందర్య - ము ల లో. | ; - సుఖము నీ | త . . . - మ్మ ను ||
; * ,, - రిసా - గ రిగా | ; - గగారిసా | ,, ||
; * ,, - ముల - లో. . | ; - సుఖమునీ | ,, ||
; * పాపా ; - గ రిపమ - ధపధా | ; - ప ధనిధపా | మా ; పాధప - మపగా ||
; * సామి ; - త్రి.కి. - కనుల | ; - జా. . డ ల | సు ; ఖ , , - ము. . ||
రిస *
. . * (లేకయా)

(ఇతర చరణములను ఇటులే పాడుకొనవలయును.)

అవతారిక:—ఇంక అయ్యగారు భక్తు లవతరించుట భగవంతుని కల్యాణగుణములను నోరారఁ జెప్పుటకే యని భక్తజన్మ ప్రయోజనమును నిరూపించుచున్నారు.

(33) అసావేరి - ఆది.

ప. ఏపనికో జన్మించితినని నీ - వెంచవలదు శ్రీరామా నే  (నే)

అ. శ్రీపతి శ్రీరామచంద్ర నీ - * చిత్తమునను తెలియదా నే  (నే)

చ. వాల్మీకాదిమునులు † నరులు నిను - వర్ణించిరి నాయాసదీరనా
మేల్మియై యుండు సద్భక్తులు - మెచ్చుదురే త్యాగరాజనుత నే  (నే)

ప్రతిపదార్థము.

శ్రీరామా - శ్రీరామా
నేను - నేను
ఏ పనికిన్ ఓ. - ఏకార్యమునకుఁగానో
జన్మించితిన్ అని - పుట్టితినని
నీవు - నీవు
ఎంచవలదు - తలఁచవద్దు

* 'చిత్తానికి' అనునది గ్రామ్యపాఠము.     † 'ఘనులు' అని పాఠము.

శ్రీపతి - లక్ష్మీనాథా
శ్రీరామచంద్రా - శ్రీరామచంద్రా
నీచిత్తమునకున్ - నీమనస్సునకు
తెలియదు ఆ - తెలియదా
వాల్మీకాదిమునులు-వాల్మీకి మొదలుగాఁగల మునులును
నరులు - మనుష్యులును (పండితులును)
నినున్ - నిన్ను
వర్ణించిరి - కొనియాడిరి (దానిచేత)

నాయాస - నాయొక్క యాశ
తీరునా - తీరునా ? (తీరదు)
మేల్మి ఐ - (ఆవర్తనము) శ్రేష్ఠమైనదియై
ఉండును - ఉండును
త్యాగరాజనుత - త్యాగరాజుచే కొనియాడఁబడు రామ
సద్భక్తులు - ఉత్తములగు భక్తులు
మెచ్చురురా ఈ - ఈ విషయమును శ్లాఘింతురా

విశేషార్థము:—లోకములో జీవులు వారివారి కర్మఫలానుభవమునకుగాఁ బుట్టి తదనుగుణమగు నదియో యొక కార్యము నొనర్చుచున్నారు. అటులే నే నీలోకభోగము ననుభవించుటకై పుట్టితి ననుకొంటివా? కాదు! 'జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః । సాత్త్వికస్తు విజ్ఞేయస్స వై మోక్షార్థచింతకః' అన్నట్లు జీవుని పుట్టించునపుడే నీవు వానిని కటాక్షించినంగదా వాఁడు సాత్త్వికుఁడై సంసారమునం దసహ్యము తోఁచి మోక్షమునం దభిలాష గలవాఁ

డగుచున్నాఁడు. శ్రీపతీ! లక్ష్మీపురుషకారముచే నా కిట్టి సన్మార్గమును జూపిన నీకు ఈమర్మము దెలియదా? అమ్మ పుట్టిల్లు మేనమామదగ్గఱ పొగడిన చందమున నేను భక్తుఁడను, నిన్ను నుతించుటకుఁ బుట్టినవాఁడను అని సర్వజ్ఞుఁడవగు నీకుఁ దెలుపవలయునో? అక్కఱలేదు. కావున నాకు నీ వీ జన్మ మొసఁగినది నోరార నిన్ను కీర్తించుటకే గాన నా యథాశక్తి నిన్ను స్తోత్రము చేయుచున్నానని భావము.

"నీ స్తోత్రమున కేమి కొదవ, 'ప్రాచేతసస్త్వాదికవిః' అనునటులు కవులలో నగ్రగణ్యుఁడై, 'మచ్ఛందాదేవ తు బ్రహ్మన్ప్రవృత్తేయం సరస్వతీ' అనునటులు సరస్వతిని సాక్షాత్కారమున నిడుకొని కవితాధోరణిని ప్రసరింపఁజేయువాఁడై, 'వేదః ప్రాచేతసాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా' అనునటులు వేదమును రామాయణముగ మార్చిన వాల్మీకిభగవానులు మొదలగు మునులు మఱియు పండితోత్తములగు కొందఱు మనుష్యులును వారివారి శక్తికొలఁది నుతించి యుండిరే! ఇఁక నీ వొనర్పవలసిన దేమియున్నది?" అనినయెడల, ఎవఁడన్నముఁడినునో వానికి ఆఁకలి దీరునుగాని వేఱొకరునికిఁ దీరునా? అటులే వాల్మీక్యాదులు నుతించిన నాయాకలి దీరునా? 'వైకుంఠుఁ బొగడని

వక్త్రింబు వక్త్రమే ఢమఢమధ్వనితోడి ఢక్కగాక, చక్రి చింతనలేని జన్మంబు జన్మమే తరళ సలిల బుద్బుదంబుగాక. విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే పాదయుగముతోడి పశువుగాక' అనునటులు నిన్ను మనసార ధ్యానించి నోరారఁ గీర్తింపకున్న నాజన్మము జన్మమా? కావున నీ భజన యొనర్చి నాజన్మసాఫల్య మొనర్చుకొనెదను, అని అయ్యగారు భగవద్గుణానుభవమునకన్న జన్మసాఫల్య మొందించుటకై వేఱొక సాధనము లేదని నిరూపించుచున్నారు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప. ; | * | రీ , రిమా - పా ; ; - పమ | పా ; - ; ; | పమధపా - గరి స | ‖ |
| ; | * | ఏ , ప ని - కో ; ; - జ . | న్మ ; - ; ; | చి . తి . - నని . | ‖ |
| ; | * | రీ , రిమా - పా ; ; - పమ | పధపధమపగా | ,, | ‖ |
| ; | * | ఏ , ప ని - కో ; ; - జ . | న్మం. . . . . | ,, | ‖ |
| ; | * | గరీమమా - పధసా ; సరీ | నిసపధమపగా | ,, | ‖ |
| ; | * | ఏ . ప ని - కో . ; జ . | న్మ. . . . . . | ,, | ‖ |
| ; | * | ,, - పధసరీగా - సరీ | ,, | ,, | ‖ |
| ; | * | ,, - కో . . . - జ . | ,, | ,, | ‖ |

; * గా , రిసా – స్రీరిసా ; – | గరిపమధపనిధ | మామాపాధప – మగరిస ||
; * ఎం , చవ – లదుశ్రీ ; – | రా. . .... | మా . .... – నే ... ||

; *
; * (నేపనికో)

అ. ; * నిసాంపధా – సాం , సాం , సాం | సాం ; – రిగరిస | ; – సనిధపధా ||
; * శ్రీ . పతి – శ్రీ , రా , మ | చం ; – ద్రా. . | ; – నీ.... . ||
; * సాం , ససాం – రినిసప – ధపధా | ; – గ రిపమధప | నినిధపగారిస ||
; * చి , త్రము – న . మ. – దె. లి | ; – య.దా . . | నే..... ||

; *
; * (నేపనికో)

చ. ; * పా , పా , – ధాపాధా | ; – పధాపమా | రీగా , రిసా ||
; * వా ; ల్మీ , – కా . ది ; | ; – మునులున | రులు , నిను ||

; * గా , రిసా - సరీస్నీసా ; | ; - రిగ రీమా | పా ; - ధపధా ||
; * వ , ర్లిం. - చి.రినా ; | ; - యా. ప | దీ ; - రు.నా |
; * నిస్సాపధా - సా ; స్సాసా | ; స్సారిగిరిస | స్సా ; - సనిధా ||
; * మేల్మిమై - యుం; డు . | ; సద్భ. . . . | క్తు ; - లు. . ||
; * పధా రిస్సా - రినిసప - దధపా | ధా - గరిపమధప | నినిధప - గారిస ||
; * మెచ్చుదు - రే. . . - త్యా. | గ - రా. . జ | ను.త . - నే. . ||

నిస *

. . * (నేపనికో)

(ఇతర చరణములును ఇటులే పాడుకొనవలయును.)



అవతారిక:—ఇందు శ్రీరామభక్తిలేని జన్మము వ్యర్థమని అనేక దృష్టాంతములతో నిరూపించుచు ఈ జన్మము పోకమునుపే అట్టి భక్తిని సంపాదింపవలయునని సమయము గౌరవమును గూడఁ దెలుపుచున్నారు.

## (34) అసావేరి - చాపు.

ప. సమయము దెలిసి పుణ్యము లార్జింపని - కుమతియుండియేమి పోయియేమి (స)

అ. సమతతోడి ధర్మము జయమే కాని - క్రమముతో మనవిని వినవే ఓమనస (స)

చ. సామజా కవితలవిని వెఱ్ఱివాఁడు - సంతోషపడియేమి పడకేమి
చేరఁడేసి గ్రుడ్డికన్నులు బాగుగఁ - దెఱచియేమి తెఱవకుండియేమి (స)

2. తురకవీథిలో విప్రునికిఁ బానకపూజ - నెరయఁజేసియేమి చేయకుండియేమి
ధరనీని ధనకోట్ల యజమానుఁడు - దాబ్రతికియేమి దయ్యమైననేమి (స)

3. పదము త్యాగరాజ నుతునిపైఁ గానిది - పాడియేమి పాడకుండియేమి
ఎదను శ్రీరామభక్తియులేని నరజన్మ - మెత్తియేమి యెత్తకుండియేమి (స)

(ఇది సులభశైలి గనుక దీనికి ప్రతిపదార్థము వ్రాయలేదు.)

విశేషార్థము:— 'దుర్లభో మానుషో దేహో దేహినాం క్షణభంగురః' అనునటులు

మనుష్యజన్మ మెత్తుట చాలదుర్లభము. ఇట్టి జన్మసమయము తటస్థించినపుడే మనుజుఁడు సుకృతము నార్జింపవలయును. అట్లు ఆర్జింపని బుద్ధిహీనుఁడు ఉండిన నేమి పోయిన నేమి?

సమయము గౌరవ మెఱుఁగని అట్టివాని మనుగడ తురకల బాజారులో బ్రాహ్మణులకై వడపప్పు పానకములు చేసినటులును, మూర్ఖునకు కవిత్వ రసమును వినిపించినటులును, భగవంతునకంటె అన్యదేవతలను స్తోత్రము చేసినటులును వ్యర్థమని నిరూపించుచు, ఈ శరీరముపోక మునుపే సత్కథాకాలక్షేప మొనర్చవలయుఁగాని మించిన తరువాతను చింతించిన నించుకంతయు ప్రయోజనము లేదనియు, అది గతజలసేతుబంధముఁబోలిన దనియు నానతిచ్చుచున్నారు.

ప. , ＊ రి రి | మామా ‖ పపా | ధాపా ‖ ప మా | పా , మ ‖ మా , | గరిసా ‖
, ＊ సమ | యము ‖ తెలి | సి పు ‖ ణ్యము | లా , . ‖ ర్జిం , | ప. ని ‖
, ＊ రి గ | రీ - సా ‖ , సా | స రిపా ‖ , - రి మ | పాధప ‖ మా , | గరిసా ‖
, ＊ కుమ | తి - యుం ‖ , డి | యే.మి ‖ , - పో. | యియే. ‖ మి , | . . . ‖
అ. , ＊ పమ | పాధా ‖ సస్తా | సాస్తా ‖ , - రీగి | రీసా ‖ స నీ | సాసా ‖
, ＊ సమ | త తో ‖ డి ధ | ర్మము ‖ , - జయ | మే. ‖ కా. | . ని ‖

, * పధ | సాస్సా ‖ నిస్సని | ధపధా ‖ , – పమ | పా ధ ప ‖ మగా | రీసా ‖
, * క్రమ | ముతో ‖ మన. | వి. ని ‖ , – విన | వే యో. ‖ మన | స. ‖

చ. , * పా | పాపమ ‖ గ·గా | సరిగా ‖ , – సరి | గారీ ‖ సా , | రీసా ‖
, * సా | ర మా ‖ కవి | త. ల ‖ , – విని | వేత్తి ‖ వా , | . డు ‖

, * రిరి | మామా ‖ పపా | ధప ధా ‖ , – పధ | పామా ‖ పా , | ; ; ‖
, * సం | తోష ‖ ప డి | యు. ‖ , – పడ | కే . ‖ మి , | ; ; ‖

, * పమ | పాధా ‖ సస్సా | సాస్సా ‖ , – రిగ | ర్రీసా ‖ స నీ | సాస్సా ‖
, * చే. | ర డే ‖ . పి | గ్రొ డ్డి ‖ , – క. | న్నులు ‖ బా. | గు గ ‖

, * ప ధ | స్సాస్సా ‖ నిధా | ధపధా ‖ , – మా | పాధప ‖ గా , | రీసా ‖
, * తెలి | చి యే ‖ మిత | అ. వ ‖ , – రం | డి . . ‖ యే , | మి. ‖

(ఇతర చరణములును ఇటులే పాడుకొనవలయును.)



అవతారిక:—ఇందు అయ్యగారు, 'ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్' అనునటులు దేవత్వము దాఁచిపెట్టి దశరథ మహారాజునకు కొమారుఁడై పుట్టి రామరాజని పేరు పెట్టుకొన్నది మావంటి భక్తులతో కలసి మెలసి మాట్లాడుటకుఁ గదా? శ్రీరామా ఏల నీ సౌశీల్యమును దాఁచుచున్నావు అని ప్రార్థించుచున్నారు.

(35) ధన్యాసి - ఆది.

ప. రామాభిరామ మనసు - రంజిల్లఁ బల్కఁగ రాదా (రా)

అ. ఈనుహీని వెలసిన - దేల సదా నాతో (రా)

చ. బంగారు మేటి పాన్పుపై - భామామణి జానకి
శృంగారించుకొని - చెలువొంద నిన్నుఁ గని
పొంగుచు మల్లెవిరులఁ - బూజించు వేళ శ్రీహరి
సంగీతము పాడుమని - స్వామి త్యాగరాజుతో (రా)

ప్రతిపదార్థము.

రామా - స్త్రీలకు
అభిరామ - మనోహరమైనవాఁడా
ఈమహినిన్ - ఈభూమియందు
వెలసినది - అవతరించినది
ఏలా - ఎందులకు
సదా - ఎల్లప్పుడు
నాతోన్ - నాతో
మనసు - మనస్సు
రంజిల్లన్ - సంతోషించునట్లు
పల్కరాదా - మాట్లాడఁగాదా
శ్రీహరీ - శ్రీహరీ
బంగారుమేటి పాన్పుపయిన్ - బంగారు మయమగు మంచిపడకమీఁద

భామామణిజానకి - స్త్రీరత్నమగు సీతాదేవి
శృంగారించుకొని - అలంకరించుకొని
చెలువు ఒందన్ - చక్కఁదనము ప్రకాశించునటులు
నిన్నున్ - నిన్ను
కని - చూచి
పొంగుచున్ - ఉత్సాహమొందుచు
మల్లె విరులన్ - మల్లె పువ్వులచేత
పూజించువేళన్ - పూజించుసమయమున
స్వామి - ప్రభూ ! రామా
త్యాగరాజుతోన్ - త్యాగరాజుతోడను
సంగీతము పాడుము అని - ఒకపాటపాడుమని
(మనసురంజిల్లఁ బల్కరాదా)

విశేషార్థము:—త్యాగయ్యగారు సీతారాములకు అంతరంగ కైంకర్యమును చేయఁదలఁచి, 'తమూనసహాసీన మనస్తభోగిని ప్రకృష్ట విజ్ఞాన బలైకధామని' అనునటులు విజ్ఞానమయుఁడగు, ఆదిశేషుఁడను దివ్య పర్యంకమున సీతాదేవితో కూడి వేంచేసి యుండ సీత దివ్యాలంకార మొనర్చుకొని, నిన్ను విలాసమగు చూపులచేఁ జూచి నీపైని పూలుచల్లి నిత్యానందసముద్రమున ముంచు వేళ నాతో 'ఉడుత భక్తి' యనునటులు దాసుఁడు కోరుచున్న గానకైంకర్యమును చేయుమనా మది సంతోషించునటులు, ఇంచుక యానతి యియ్యరాదా అని ధ్యానయోగముచేత భగవంతుని యేకాంత సేవోత్సవమును అనుభవించుచున్నారు.

ధన్యాసి రాగలక్షణము:—ఇది 8-వ మేళమైన హనుమతోడియందు జనించినది. ఆరోహణమునందు ఋషభ ధైవతములు వర్జ్యము. అవరోహణము సంపూర్ణము. ఇందు సాధారణగాంధార కైశికీ నిషాదములు రాగచ్ఛాయా స్వరములు; మొదటి యామమునందుఁ బాడఁదగినది. ఈ రాగమును వేంకటమఖి 20-వ మేళమునందు జన్యమని చెప్పియున్నారు. 20-వ మేళమునకుఁ గల చతుశ్శ్రుతి ఋషభము ఇం దెచ్చటనుఁ గనఁబడలేదు. ఇందుచే వేంకటమఖియొక్క అభిప్రాయ

మిదియన్ని తెలియలేదు. మఱియు, 'గరిగా' అను ప్రయోగము నందైనను చతుశ్రుతి ఋషభము పలుకవచ్చుననిననో ఈరాగమునందీ ప్రయోగము అసంభావితముగ నున్నది.

19

ఆరోహణము.　　అవరోహణము.

స గా మ ప నీ స　　స ని ధ ప మ గ రి స

'మగారిస - సగామా - మగరిస - పనిసానిధపమగరిస - నిసగామగరిస - మున్నగునవి రాగ రంజకములు.

ప. ; ; ; * నీసా - గా ; మా - | పా ; ; - గా | ; ; - మాపా ||
; ; ; * రా. - మా ; ధి - | రా ; ; - మా | ; ; - మ న ||

2. మగరీసా * ,, | పమగమపా - గా | ,, ||
సు. . . * ,, | రా... - మా | ,, ||

3. ,, * ,, | పానీ ; - ధ ప | మగా , - మాపా ||
,, * ,, | రా. ; - మా. | . . ; - మ . ||

4. ,, * ,, | పనిసా ; - సని | ధపమగ ,, ||
,, * ,, | రా . ; - మా. | ... - - ,, ||

5. ,, * ,, | పనిసరిసరి - సని | ,, ||
,, * ,, | రా . . . . . - మా | ,, ||

6. ,, * ,, | పనిసాగా - రిస | నిధపమ - మాధప ||
,, * ,, | రా . . - . . | . . . . . - మ న. ||

7. ,, * సా ; సనిధాపా | సనిసా ; - నీ | సాగా ; మప ||
,, * రం ; జి . . ల్ల | బ . . ; - ల్కు | . గ ; - రా. ||

8. ధప-మగరిస * నీసా - గా ; మా | గమపనిసని - సగ | రిసనిధ - పమధప ||
. . -న . . . * రా. - మా ; భి | రా. . . . . . - మా | . . . . - మ. న. ||

9. మగరిసా * పా ; సనిధాపా | సనిసా ; స గ | మా - గమపా - ధప ||
సు. . . * రం ; జి. . ల్ల | బ . . ; ల్కు | . - గ . . - రా. ||

పామగరిస *
. దా . . * (రామాభిరామా)

అ. ; ; ; * గామాపా ; నీ | నిధపా ; - పా | నీసాం ఠ్రీ - ఠ్రీ ||
; ; ; * ఈ . మ ; హి | ని . . ; - వే | . ల . - సి |

సాం ; ; * ,, | ,, | ,, |
స ; ; * ,, | ,, | ,, ||

సాంనీధపమ * గామా - పానీ నీ | సనిధాపా - పా | ,, . ||
స . . . * ఊ . - మ . హి | ని . . . - వే | ,, |

రిసనిధపమ * ,, | ,, | ,, ||
. . . . . * ,, | ,, | ,, |

సనిగాం ; * మగరిసరినిధప - నీ | సాం ; ; - సని | ధపమగా , - మప ||
స . . ; * దే . . . . ల . . . - స | దా ; ; - . . | . . . నా , - తో |

ధపమగరిస *
. . . . . . * (రామాభిరామ)

చ. ; ; ; * పా ; పా ; పా | మపధప - మాపా | ; - గా ; మా ||
; ; ; * బం ; గా ; రు | మే. . . . - . . | టి - పా ; న్ను ||

పా ; ; * పా ; పా ; పా | గా ; ; - మప | ధా - పమగారీ ||
పై ; ; * భా ; మా ; మ | ణి ; ; - . . | . - జా. న . ||

సా ; ; * సా ; ; మా ; | మా ; గా - మా | ; - మాపా - పమ ||
కి ; ; * శ్ర్యం ; ; గా ; | రిం ; . - చు | ; - కొ . - . . ||

గా ; ; * గామా - పనిధాపా | గా ; - పామా | ధాపామా - మగ ||
ని ; ; * చెలు - వొం. ద | గ ; - ని . | న్న . . - . గ ||

రిసా ; * గామాపానీ నీ | నీధాపా - పా | నీస్సాస్రీ - నీ ||
ని . ; * పొం. గు . చు . | మ . . - త్తై | . వి . - రు ||

సాం ; ; * సాంనీ- గాం ; గాం | గరిసాం , - సాం | ; సనిధాపా ||
ల ; ; * బూ - జిం ; చు | వే . . , - ళ | ; శ్రీ. . . ||

నీసాం ; * గాం ; గాం ; మాం | గాంగాంరి - సాం | ; - సనిధాపా ||
హరి ; * సం ; గీ ; త | . ము . - పా | ; - డు. . . ||

నీసాం ; * గాం ; రిసాం - సని | ధప - నీసాంసని | ధపగా ; - మప ||
మని ; * స్వా; మి . - త్యా | . . . - గ. . . | . . . ; -జు. ||

ధపమగరిస *
. . తో . . * (రామాభిరామ)



అవతారిక:— ఇందు అయ్యగారు, 'సకృద్గీతాంభసి స్నానం సంసారమలమోచనమ్' అనఁగా, ననేకపర్యాయములు గంగాస్నాన మొనర్చుటకన్న నొకసారి భగవద్గీతయను నీటియందు స్నానమొనర్చినయెడల సంసారమనెడి మురికి నిశ్శేషముగ నశించు ననునటులు శ్రీరామధ్యానమే శుద్ధ

మయిన స్నానముగాని శరీరముయొక్క ముఱికిని మాత్రము పోఁగొట్టు తక్కిన దశవిధ స్నానము లెవ్వియు ఈ ధ్యానస్నానమునకు సాటిగా వనుచున్నారు.

(36) ధన్యాసి - ఆది.

ప. ధ్యానమే వరమైన గంగా - స్నానమే ఓ మనసా (ధ్యా)

అ. వాననీట ¶ మునుఁగమునుఁగ లోని - - ద్రోహ † మను కలుషపోనా (ధ్యా)

చ. పరధన నారీమణులను దూటి - పరనిందలఁ బరహింసల మీటి

ధరను వెలయు శ్రీరామునిగోరి - త్యాగరాజు దెలిసికొన్న రామ (ధ్యా)

ప్రతిపదార్థము.

మనసా - ఓమనస్సా

ధ్యానము ఏ - శ్రీరాముని దలఁచుటయే

వరమైన గంగాస్నానము ఏ - శ్రేష్ఠమైన గంగానదిలో చొనర్చిన స్నానముగదా

వాననీటన్ - వర్షముచేఁ గలిగిన నీటియందు

మునుఁగన్ మునుఁగన్ - స్నానము చేయఁగాఁ జేయఁగా

లోనివంచన - మనస్సులోని కపటమును

ద్రోహము - దుష్టచింతయును

¶ 'మునిఁగి మునిఁగి లోని' అని యొక పాఠము. † 'మదాహంకారము పోనా' అని యొక పాఠము.

అను కఱ - అనెడు మఱికి
పోఁ ఆ - పోవునా (పోదు)
పరధన నారీమణులను - ఇతరుల ద్రవ్యమును స్త్రీలను
దూఱి - నిరసించి
పరనిందలఁ - పరదూషణలను
పరహింసలఁ - పరులను బాధించుటను
మీఱి - అతిక్రమించి
ధరను - భూమియందు
వెలయు శ్రీరామునిఁ - వెంచేసియుండు శ్రీరాముని
కోరి - ఆశించి
త్యాగరాజు - త్యాగరాజు
తెలిసికొన్న రామధ్యానము ఏ - యెఱిఁగిన శ్రీరామ స్మరణమే
(వరమైన గంగాస్నానము)

విశేషార్థము:—మనుష్యునకు శరీరమలము సులభముగఁ బోవును. అందులకు స్నానము మొదలగు సాధనములుగలవు. పరులను వంచించుట, పరుల కపకార మొనర్చుట పరస్త్రీలను పరధనములను ఆశించుట అనునవి మనోమలములు. ఇట్టి మనస్సునఁ బట్టిన మఱికిని బోఁగొట్టుటకు గంగాది నదీ స్నానము లెవ్వియు సాధనములుగావు. కావున, 'గోవిందేతి సదా స్నానమ్' అనునటులు భగవద్ధ్యానమను స్నానమే గొప్ప స్నానమని అయ్యగారు మనస్సంబోధన చేసి నిరూపించుచున్నారు.

ప. ; * మగామ - పధపధమాపా- ;; - పని | సా ; - సానిధ | పమ - పా ; - పాధప ||
; * ధ్యా. న - మే . . . . - ;; - వర | మై ; - . . . న | . . - గం ; - గా . . ||

ప మ * గా , మ - ,, - పని | సారిసనీసా - ; నిధ | ,, ||
. . * ధ్యా, న - ,, - వర | మై . . . . - ; న . | ,, ||

,, * గా , మ - పనిపా - నీ ;; - సని | సగరి - సా ; - నిధ | పమపా - పాధప - పాధప ||
,, * ధ్యా, న - మే . - - , ;;వర | మై - . ; - న . | . . గం - గా. . - . . . ||

ప మ * గా , మపా - నిసనిధ - పమ - ధప | మా , ×గరీ , - సా ; | గామా×మపా - పా ; పాధప ||
. . * స్మా, న మే - . . . . . - ఓ. - మన | సా , . . . , - . ; | రా . . . . - మ ; . . . ||

ప మ * గా , మ - పనిపా - నీసా ; - నిస | సమగాగారిసా ;-నిధ | పమ - పా ; - పనిసని ||
. . * ధ్యా, న - మే . - - . ; - వర | మై. . . . . ; - న. | . . - గం ; - గా . . ||

ధపామ *గా,మ-పనిసరిసనిపాధాపా;-పమ-ధప| మా , ×-గరీ , - సా ; | ×మపని - సానిధ ||
. . . *స్మా, న - మే . . . . . . ;-ఓ.-మన| సా , . - . . , - . ; | రా. . . - మ . . ||

20

పమ * ,, | ,, | గమపనిసా ; - సనిధపపాధప ||
. . * ,, | ,, | రా. . . . ; - మ. . . . . . ||

మపామ*
. . . * (ధ్యానమే)

అ. ; * నీనిప - నీసాసని - గాగా | గమాగ-గరీ ,-రీసా | నినిపా - సనిసా ||
; * వాన - నీ . .ట - ము ను | గ . . .-ము. , - నుగ | లో . - . . ని ||

; * రిససా - రినినీ - పనిపా - పసనీనీ ; | సరిసా - నిసానిధప | మామా - గామాపాధప ||
; * వం. . - చ. న - ద్రో. -హా. . . ; | మ. . - ను. కఱ. | పో . .. నా . . . . ||

పమ*
. . * (ధ్యానమే)

చ. ; * పపా - ధపా - పాధప - మపమగ | ; - గమాప నీ | సనిధప - మపమగ ||
; * పర - ధన - నా. . - రీ . . . | ; - మణులను | దూ. . - . . .తి ||

; * గమ-స్నానిధాపా-మగాపమగా-రీసా | ; - నిసా - గమ | పధపధపామా - పధమప ||
; * పర ..నిం, . . . . . ద . ల . . -బగ | ; - హిం - సల | మీ. . . . - . . తి . ||

ధరను వెలయు శ్రీరామునిగోరి త్యాగరాజు దెలిసికొన్న రాము

(అనుపల్లవివలెనే పాడుకొనవలయును.)



అవతారిక:—— ఇందు త్యాగయ్యగారు రామచంద్రా! నీ భక్తులతోపాటు నన్నును, భేదము లేక చూడుమనియు నేను నీవాడనే యనియు వేడుచున్నారు;

(37) ధన్యాసి - రూపకము.

ప. శ్యామసుందరాంగ-సకల శక్తివి నీవేర (శ్యా)

అ. తామసరహిత గుణసాంద్ర - ధరను వెలయు రామచంద్ర (శ్యా)

చ. దుష్టదనుజ మదవిదార - శిష్టజన హృదయవిహార
ఇష్టదైవము నీవేర - యిలను త్యాగరాజునేలు (శ్యా)

## ప్రతిపదార్థము.

శ్యామసుందరాంగ - మేఘమువలె నీలమైన చక్కని శరీరముగలవాఁడా
తామసరహిత - తమోగుణము లేనివాఁడా
గుణసాంద్ర - సుగుణములచేత దట్టమైనవాఁడా
ధరను - భూమియందు
వెలయు రామచంద్రా - అవతరించి వెంచేసియున్న రామా
సకలశక్తివి - సమస్తశక్తులు గలవాఁడవు
నీవేర - నీవే యనుట

దుష్టదనుజ మదవిదార - దుర్మార్గులయు రాక్షసులయు మదమును బోఁగొట్టువాఁడా
శిష్టజన హృదయవిహార - మంచివారల మనస్సునందు విహరించువాఁడా
ఇష్టదైవము - నాకులదేవతవు
నీవేర - నీవేనురా
త్యాగరాజు - త్యాగరాజను, ఈదాసుఁడు
వేఱ - నివాఁడుగాఁడా ?

విశేషార్థము:— శుద్ధ సత్త్వమయుఁడవై సకల కల్యాణగుణాకరుఁడ వగు నీవు, 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే' అనునటులు దుష్టులను సంహరించుటకును, శిష్టులను పాలించుటకును రామచంద్రుఁడవై అవతరించి, 'రామస్య లోకరామస్య' అనునటులు సర్వజనులు మోహింపఁదగిన శ్యామసుందర దేహుఁడవై భయంకరులగు రాక్షసులఁ దునుమాడి అఘటనఘటనాశక్తుఁడ

వగు నీవు దాసుని పాపములను నశింపఁ జేయఁజాలగ పీనినిమాత్రము వేఱుగఁ జూడవచ్చునా? కులదైవమవగు నీకు, ఇది తగునా? అని తమ ఆర్తిని దెలుపుచున్నారు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప. ; | * | పా | \| పాగా ; మా | ‖ పా ; | \| పా ; పా ; ‖ |
| ; | * | శ్యా | \| మసుం ; ద | ‖ . ; | \| రాం; గ ; ‖ |
| ; | * | ధా | \| ,, | ‖ ,, | \| నీ ; - సనిధప ‖ |
| ; | * | శ్యా | \| ,, | ‖ ,, | \| . ; - గ . . . ‖ |
| మా | * | ధా | \| ,, | ‖ ,, | \| పా ; పా ; ‖ |
| . | * | శ్యా | \| ,, | ‖ ,, | \| . ; గ ; ‖ |
| ; | * | మగ | \| మాపా ; పా | ‖ మగపమ | \| ధప - మగరిసా ‖ |
| ; | * | సక | \| ల శ ; క్తి | ‖ వి . నీ . | \| . . . వే . . ర ‖ |
| ; | * | ధా | \| పాగా ; మా | ‖ పా ; | \| పా ; పా ; ‖ |
| : | * | శ్యా | \| మ సుం; ద | ‖ రాం; | \| . ; గ ; ‖ |

; * మగ | మాపానీ - సని ‖ ధప - పమ | ధపమగరిసా ‖
; * సక | ల శ . - క్తి. ‖ వి. - నీ . | . . వే . . ర ‖

; * ధా | పాగా ; మా ‖ పా ; | పా ; పా ; ‖
; * శ్యా | మ సుం; ద ‖ రాం; | . ; గ ; ‖

అ. ; * గాం | గాంగాం - గాంమగ ‖ గరిసాం | సాంసాం ; నీ ‖
; * తా | మ స - ర . హి ‖ త . గు | ణ సాం; ద్ర ‖

సగరిస | రిస - సనిరిసని ధ ‖ పనిసని | ధప - ధపమగరిస ‖
ధ . ర . | ను. - వెల. . .యు ‖ రా . . | మ. - చం . . ద్ర ‖

నిస *
. . * (శ్యామ)

చ. ; * పా | పాపాపాపా ‖ మామా | మా - పమగాగా ‖
; * దు | ష్ట ద ను జ ‖ మ ద | వి - దా. . ర ‖

| ; | * | గా | మాపానీసాం | ‖ | సనిధా | పా - పమగారిస | ‖ |
|---|---|---|---|---|---|---|---|
| ; | * | శి | ష్ట జ నహృ | ‖ | ద . య | వి - హా. . ర. | ‖ |
| ; | * | గాం | గాంగాం ; గాం | ‖ | మగిపమ | గాం- రీ ; సాం | ‖ |
| ; | * | ఇ | ష్ట దై ; వ | ‖ | ము. నీ . | . - వే ; ర | ‖ |
| సనిగిరి | | | రిసి - సి నిరిసినిధ | ‖ | ప నిసని | ధప- ధపమగరిస | ‖ |
| ఇ . ల . | | | ను. - దా్య. . గ. | ‖ | రా. . . | జా.- వే. ... అ | ‖ |

.స *

.ని *    (శ్యామ)



అవతారిక:—ఇందు అయ్యగారు సర్వాకాల సర్వావస్థలయందును, సకల కార్యముల యందును, శ్రీరాముని దయతప్ప వేఱేగతి లేదనుచున్నారు.

(38) ధన్యాసి - రూపకము.

ప. ఎందుఁబాయరాదయ - యినకులతిలకా దయ (ఎం)

అ॰ ఇందువదన కుందరదన - మందరధర నీదయ (ఎం)

చ॰ శాంతభూష భక్తపోష - శరణ శేషశాయి (ఎం)

2॰ శ్రితశరణ్య సురవరేణ్య - కృతసుపుణ్య ధన్య దయ (ఎం)

3. నాగరాజధరనుతవ్రజ - త్యాగరాజవరద దయ (ఎం)

ప్రతిపదార్థము.

ఇనకులతిలకా - సూర్యవంశమునకు తిలకమువంటివాఁడా
దయ - నీకృప
ఎందుకే - ఏవిషయమునందును
పాయరాదు అయ్య - విడిచిపెట్టఁ దగదయ్యా
ఇందువదన - చంద్రునివంటి ముఖముగలవాఁడా
కుందరదన - మల్లెమొగ్గలవంటి పలువరుస గలవాఁడా
మందరధర - మందర పర్వతమును మోసినవాఁడా
(ఎందుఁ బాయరాదయ)

శాంతభూష - ఓర్పు ఆభరణముగఁ గలవాఁడా
భక్తపోష - భక్తులను పోషించువాఁడా
శరణ - రక్షకుఁడా
శేషశాయి - ఆదిశేషుని మీఁద పవ్వళించువాఁడా
(ఎందుఁ బాయరాదయ)
శ్రితశరణ్య - ఆశ్రితులకు దిక్కైనవాఁడా
సురవరేణ్య - దేవతలలో శ్రేష్ఠుఁడా
కృతసుపుణ్య-చేయఁబడిన మంచి పుణ్యముగలవాఁడా

ధన్యా - కృతార్థుఁడా
దయ - నీ యనుగ్రహము
(ఎదుట పాయరాదయా)
నాగరాజధరనుత - శివునిచే కొనియాడఁబడువాఁడా

అజ - జన్మములేనివాఁడా
త్యాగరాజవరద - త్యాగరాజునకు వరము లిచ్చువాఁడా
(ఎందుకు పాయరాదయ)

విశేషార్థము:—ఇందు బ్రహ్మాదిదేవతలు మొదలు మనుష్యులవఱకును భగవంతునిదయ, ఆవశ్యక మైనదనియు, 'మందరధర' అను విశేషణముచే ఆపత్కాలములయందు స్నేహితునివలె వచ్చి రక్షించువాఁడని, అమృత మథన కాలమున మందరగిరి మునుగునపుడు కూర్మావతార మెత్తి పర్వతము నుద్ధరించిన వృత్తాంతమును సూచింపుచున్నారు. మఱియు, ఇందువదన, కుంద రదన, శాంతభూష, భక్తపోష, అను విశేషణములచే భక్తులు దగ్గఱఁ జేరుటకు రుచి పుట్టించునట్టి శాంతి మొదలగు గుణములేగాక, 'చంద్రకాన్తాననం రామ మతీవ ప్రియదర్శనమ్' అనునటులు చంద్రునివలె, ఒరులమనస్సును రంజిల్లఁజేయు ముఖముగలిగి చూచువారలకు తనివి దీరనిరూప సంపదయుఁ గలిగి ఆశ్రిత సులభుఁడై యుండువాఁడనియు, మఱియు 'శేషశాయి, సురవరేణ్య, నాగ రాజ ధరనుత, అజ' ఇత్యాది విశేషణములచే, 'అజోపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోపిసన్'

అనియు, 'తన్దేవతానాం పరమంచ దైవతమ్' అనియు, 'తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్' అను నట్లు కర్మప్రయుక్తమగు జన్మము లేక సమస్తభూతములకును, అధిపతులైన దేవతలకెల్ల నధిదేవతయు ఈశ్వరుల కందఱకును ఈశ్వరుఁడై శేషశయనముపైఁ బవళించి భక్తులయొక్క రక్షణ చింతచే యోగనిద్రఁబూని యొద్దఁ జేరినవారి కార్యముల నెఱవేర్చఁగలిగిన మహాసర్వజ్ఞతను గూడ ఇంక అయ్యగారు వెల్లడించుచున్నారు.



| | | | | | |
|---|---|---|---|---|---|
| ప. ; | * | స్రా | స్రా – నీధాపా | మాగా | రిసా ; ; ‖ |
| ; | * | ఎం | దు – బా. యా | రా . | దయ ; ; ‖ |
| ; | * | నీ | పాగా ; మా | పా , ని | ; – స్రా , – రిసని ‖ |
| ; | * | ఇ | న దు ; ల | తి , ల | ; – లా , – ద .య ‖ |
| ధప | * | నీ | స్రా – స నిధాపా | మా ; | పమగారిసా ‖ |
| . . | * | ఎం | దు – బా. . య | రా ; | ద . యా, . ‖ |
| ; | * | నీ | పాగా ; మా | పనిసగీ | రిసి – నిధపమగమ ‖ |
| ; | * | ఇ | న దు ; ల | తి. ల. | . . – లా. ద . యా. ‖ |

పని * స్సా | స్సా - స నిధాపా || గా ; | పమగారిసా ||
- . * ఎం | దు - బా. . య || రా ; | ద . య. . ||
చ. ; * గ్గా | గాగాగాగా || గాపమగ | రిస - నిధపానిస ||
; * ఇం | దు వ ద న || కుం . . | ద . - ర. ద న. ||
స్సా ; | స్సా - సనిధాపా || పమగా | రిస - గామపనీ ||
మం ; | ద - ర . ధ ర || నీ . . | ద. - య . . . ||
; * స్సా | గా - స నిధాపా || గా; | పమగారిసా ||
; * ఎం | దు - బా. . య || రా ; | ద. య. . ||

( ఇతర చరణములును ఇటులే పాడుకొనవలయును. )



అవతారిక:—ఇందు అయ్యగారు భక్తిలేనియెడల సంగీతజ్ఞానమున్న మాత్రమున సద్గతి లేదనియు, ఇంతియేగాక కేవల వాక్యార్థ జ్ఞానముచేతను భక్తిలేకున్నయెడల ప్రయోజనము లేదనియు తేటపఱచుచున్నారు.

(39) ధన్యాసి - ఆది.

ప. † సంగీతజ్ఞానమున భక్తివినా - సన్మార్గముగలదే మనసా (స)

అ. భృంగి నటేశ సమీరజ ఘటజ మ - తంగ నారదాదు లుపాసించు (స)

చ. న్యాయాన్యాయములు దెలియును జగములు
మాయామయము లని తెలియును దుర్గుణ
కాయజాది షడ్రిపుల జయించు
కార్యము దెలియును త్యాగరాజునకే (స)

ప్రతిపదార్థము.

మనసా - మనస్సా
భక్తివినా - భక్తిలేక
సంగీతజ్ఞానమునన్ - సంగీతజ్ఞానముచేతను
సన్మార్గము - మంచిగతి

కలదు ఏ - ఉన్నదా
'భృంగి...దాదులు'
భృంగి - భృంగీశ్వరుఁడు (నంది)
నటేశ - నటరాజు (శివుఁడు)

† 'సంగీతజ్ఞానమున భక్తివినా' అను పాఠము అశుద్ధము.

సమీరజ - ఆంజనేయుఁడు
ఘటజ - అగస్త్యుఁడు
మతంగ - మతంగ మహాఋషి
నారదాదులు - నారదుఁడు మొదలగు వారలు
ఉపాసించు సంగీతజ్ఞానముచేత - ఉపాసనచేయు సంగీతజ్ఞానముచే (భక్తివినా సన్మార్గముగలదా)
త్యాగరాజునకే ఏ - త్యాగరాజునకే
న్యాయాన్యాయములు - మంచి చెబ్బరలు
తెలియును - తెలియును

జగములు - లోకములు
మాయామయములు అని - మాయచే నిండినవని
తెలియును - తెలియును
దుర్గుణకామాది షడ్రిపులను - చెడుగుణములగు కామాది యారుశత్రువులను
జయించు కార్యము - ఓడించుపని
తెలియును - తెలియును
(అయినను సంగీతజ్ఞానముచే భక్తివినా సన్మార్గముగలదా)

విశేషార్థము:—'హరికీర్తిం వినైవాన్యద్ బ్రాహ్మణేన నరోత్తమ। భాషాగానం నగాతవ్యం తస్మాత్పాపం త్వయా కృతమ్' అనునటులు భగవద్గుణానుభవములేక కేవల భాషాపదములచే సంగీతమును బాడుట పాపమే యగును. కావున భగవద్భక్తి లేక సంగీతమున నెట్టి విద్వాంసుఁడై చెలంగినను సద్గతి లేదనియు, అట్లయిన భృంగీశ్వరుఁడు నటరాజు మతంగ నారదాదులు సదా సంగీతమును పాడు వారలుగదా! వారికి సద్గతిలేదా? అనినచో సంగీతమునందు భగవద్భక్తి కేర్పడిన

తాధాన సాధనము. వారును, అట్టి హరికీర్తనములే సంగీతముగా, ఉపయోగించిరి గాని వేఱొక దానిని నొకప్పుడును పాడినవారలు గారనిభావము.

'న్యాయాన్యాయములు' ఇత్యాదులచే శాస్త్రజ్ఞానము సయితము భక్తి లేకున్నయెడల సద్గతి నియ్యదనియు, 'వేదభారభరాక్రాంతః స వై బ్రాహ్మణగార్దభః' అనఁగా అర్థజ్ఞానము లేక కేవల మూలముమాత్రము వేదమును పఠనము చేసినవాఁడు వేదమనెడు బరువును మోయు నొక గాడిదెవంటి వాఁడని చెప్పినటుల భక్తి లేక న్యాయాన్యాయములు దెలిసి జగము మాయామయ మని యెఱింగి కామక్రోధాదులను జయించు నుపాయము దెలిసికొన్నను, 'ఆమ్నాయాభ్యసనా న్యరణ్యరుదితం వేదవ్రతాన్య న్వహం। మేదశ్ఛేదఫలాని పూర్తవిధయః సర్వే హుతం భస్మని। తీర్థానామవగాహనాని చ గజస్నానం వినా యత్పద। ద్వంద్వాంభోరుహసంస్మృతి ర్విజయతే దేవ స్సనారాయణః' అనునటులు వేదపాఠములు, వ్రతములు, ఇష్టాపూర్తములు, తీర్థస్నానములు మొద లగునవి యన్నియు శ్రీమన్నారాయణునిపాదారవిందములపై భక్తి లేనియెడల వ్యర్థములు

కావున, ఎట్టి శాస్త్రజ్ఞానము సయితము భగవద్భక్తి యున్ననే సద్గతి నిచ్చును. లేకున్న నీ విద్యాభ్యాసము లన్నియు చెప్పులు కుట్టుకొనుట కభ్యసించినటులని భావము.

ప. ; * సా , నిధప - మపధపమాపా ; - పమగామా | పా ; ; - గా | , మపా - నీ ; ||
; * సం , గీ . . . - త . . . . జ్ఞా ; - న . . ము | న ; ; - భ | , క్తి వి - నా ; ||
; * సనిసప - ధపధమ - పా - గామాగమపా | , మ - గగరీ , స | గమపని - సనిసా ||
; * స. . . - న్మా. . - ర్గ - ము . . . . | , . . - గలదే, . | మ. న. - సా . ||
; * సా , నిధప - మపధపమాపా ; - పమగామా | పా ; ; - గా | , మపా - నీ ; ||
; * సం , గీ . . . - త . . . . జ్ఞా ; - న . . ము | న ; ; - భ | , క్తి వి - నా ; ||
; * సనిసప - ధపధమ - పా - గామాగమపా | , మ - గగరీ , స - | గమపని - సారిసి - సారిసి ||
; * స . . . . - న్మా. . - ర్గ - ము. . . . | , . . - గ.ల , దే - | మ. న. - సా . . - . . . ||
సా * సా , నిధప - మపధపమాపా ; - పమగామా | పా ; ; - గా | , మపా - నీ ; ||
; * సం , గీ . . . - త . . . . జ్ఞా ; - న . . ము | న ; ; - భ | , క్తి వి - నా ; ||

; * సనిసప - ధపధమ - పా - గామాగమపా | , మ - గగరీ , స - | గమపనిసని - గా ||
; * స . . . . - న్మా . . - ర్గ - ము . . . . | , . . - గలదే , . . | మ. న. . . . - సా ||

; * గరిసనిధప - మపధపమాపా ; - పమగామా | పా ; ; - గా | , మపా - నీ ; ||
; * సం . గీ . . . - త . . . . జ్ఞా ; - న . . ము | న ; ; - భ | , క్తి వి - - ; ||

; * సనిసప - ధపధమ - గా - గామాగమపా | , మ - గగరి ; | సా ; - ; ; ||
; * స . . . . - న్మా . - ర్గ - ము . . . . | , . . - గలదే; | . ; - ; ; ||

అ. ; * ధా , పమా - మపధపమగా - రీసా | ; - స్నీ సాగమా | పాగమ - పమపా ||
; * భృం, గి న - టే. . . . . . శ - స . | ; - మీ. ర జ | ఘుట . . - జ . . ||

; * ,, | ,, | ,. - పనిసా ||
; * ,, | ,, | ,, - . జ మ ||

; * గరిసా - రిసరినిసా - ధపపమ | పా - పమగమపా | గమపని - సగాం , ||
; * తంగ . . - నా . . ర - దా . . | దు - లు.పా. , | పిం. . . - చు. , ||

; *

; *　(సంగీత జ్ఞానమున)

చ. ; * గమగమపమ - దధపా , - ప గా | రిస - నిసాగమా | పాగమపమపా ||
; న్యా. యా . - న్యా , - యము | లు. - తెలియును | జ గ . . ములు ||

; * గమా పా ని - సి ని ధ ప - పమగా | రిస - నిసి ని ధపా | మగపమ - ధప - గా ||
; * మా. యాను - యా. మా . . ల . ని | . . - తెలియు. ను | దు . . . - . ర్గ - ఇ ||

; * నిధాపధా - మపధపపమగా ; - రిసా | ; - నీసాగమా | పాగమపమపా ||
; * కా. యజా. . . . . . . ; - డి వ | ; - డిఫులను | జ యిం . . చు ||

; * ,, | ,, | పాగమ - పనిస్తాం ||
; * ,, | ,, | జ యిం . . చు ||

; * గరిస్తాం - రిసిరినిస్తాం - ధప ధ మ | పా - ప మగమపా | గమపని - సిగా , ||
; * కా. ర్య - ము. . . . తె - లి. యు. | ను - త్యా.గ . రా | జు. న. - కే . , ||

సి ; *
; * (సంగీత జ్ఞానమున)



అవతారిక:—'ఆచార్యస్స హరిస్సాక్షాత్' అనునటుల ఆచార్యుఁడు ప్రత్యక్షముగ నున్న భగవంతుఁడు. ఆ గురుఁడు చిల్లగింజ నీటియందలి బురదను బోఁగొట్టినచందముగా జీవులయందలి పాపములను బోఁగొట్టువాఁడు, శ్రీరామా ! అట్టి ఆచార్యరూపుఁడవగు నీవు నామనస్సు చంచలమయినదని విచారింపకుము. నీమది, నిర్మలముగను, నిశ్చలముగను ఉన్నదిగావున నాదోషము లేమి చేయఁగలవు. నన్ను విడనాడకుమని అయ్యగారు ప్రార్థించుచున్నారు.

(40) ధన్యాసి - చాపు.

ప. నీ చిత్తము నిర్మలము - నిశ్చలమని నిన్నే నమ్మినాను (నీ)

అ. నాచిత్తము వంచన చంచలమని - నను విడనాడకుమీ శ్రీరామ (నీ)

చ. గురువు చిల్లగింజ - గురుఁడే భ్రమరము - గురుఁడే భాస్కరుఁడు - గురుఁడే పరుసవేది
గురుఁడే యుత్తమగతి-గురువు నీవనుకొంటి - ధరను జాసునిబ్రోవఁ-త్యాగరాజనుత (నీ)

ప్రతిపదార్థము.

శ్రీరామ - శ్రీరామా
నీ చిత్తము - నీ మనస్సు
నిర్మలము - మురికిలేనిది
నిశ్చలము - చలింపనది
అని - అని
నిన్నుఁగా ఏ - నిన్నే
నమ్మినాను - నమ్మితిని
నాచిత్తము - నామనస్సు
వంచన చంచలము - కపటముచేత చలించునది
అని - అని
నన్నుఁగా - నన్ను
విడనాడకుమీ - విడవ వలదయ్యా
త్యాగరాజనుత - త్యాగరాజుచే కొనియాడఁబడురామా
గురువు - గురుఁడు
చిల్లగింజ - చిల్లగింజవంటివాఁడు
గురుఁడే - ఆచార్యుఁడే
భ్రమరము - తుమ్మెదవంటివాఁడు
గురుఁడే - గురుండే
భాస్కరుఁడు - సూర్యునివంటివాఁడు
గురుఁడే - గురువే

పరుసవేది - పరుసవేది యనుమూలిక
గురుఁడే - ఆచార్యుఁడే
ఉత్తమగతి - సద్గతినిచ్చువాఁడు
ధరను - భూమియందు

దాసునిఁ - దాసునిఅనఁగాశిష్యుని
ప్రోవఁ - కాపాడుటకు
గురువు - అట్టిఆచార్యులు
నీవు అనుకొంటిఁ - నీవనియే తలఁచితిని

విశేషార్థము:—'గురురేవ పరంబ్రహ్మ గురురేవ పరాగతిః। గురురేవ పరావిద్యా' అనియు 'తస్మాత్తదుపదేష్టాసౌ। తస్మాద్గురుతరో గురుః' అనియునుండుటచే గురువే పరబ్రహ్మము. బ్రహ్మవిద్యయుగురువే. అన్నివిధముల రక్షకుఁడును గురువే. ఆత్మోజ్జీవన హేతువగు మంత్రము నుపదేశించుటచే, ఇంతకన్న గొప్పవాఁడు మఱియొకఁడు లేఁడు. అని అందుచే గురుదైవములు అభేదముగ ననుభవింపఁదగినవారు. చిల్లగింజ నీటియందలి బురద నెత్తిన చందముగ గురువు శిష్యుని మనస్సునందలి మురికి నెత్తివేయువాఁడు. తుమ్మెద ఒకానొక పురుగును దెచ్చి కొంతకాలమునకు తన రూపము గలిగించినటులే పాపియగు శిష్యుని తనవలె సుకృతిని చేయువాఁడు. సూర్యుఁడు చీఁకటిని బోఁగొట్టినటులే యీ జీవుని నావరించి యుండు అజ్ఞతనుఁ బోఁగొట్టువాఁడు. పరుసవేది సామా

స్వపులోహము బంగారుగాఁ జేయునటులే యొకబద్ధపురుషుని ముక్తపురుషునిగాఁ జేయువాఁడు. కావుననే, 'గుశబ్దస్త్వన్ధకారస్స్యాత్ । రుశబ్దస్తన్నిరోధకః । అంధకార నిరోధిత్వాత్ గురురిత్యభిధీయతే' అనఁగా 'గు' అనువర్ణముచే ప్రతిపాదింపఁబడు పాపమును, 'రు' అనువర్ణముచే నిరోధించువాఁడని, నిర్వచనము. కావుననే సకల పాపములను బోఁగొట్టి సకలవిధముల రక్షకమైనవాఁడు గురువే. నీవే ఆగురువుగ నున్నవాఁడవు. కావున నీగురుధర్మమును విడనాడక నీవు నిశ్చలచిత్తుఁడవై యుండఁగా చంచలచిత్తము నీరక్షణోద్యోగమునకు బాధకముగాదు కాఁబట్టి స్వధర్మమును విడనాడక నన్ను కాపాడుమని అయ్యగారు వేఁడుచున్నారని భావము.

ప. , * గమ | పామా || గ మా | గరిసా || ని̣సా | గా ; || , ; | మా ; ||
, * నీ . | చి . || త్తము | ని . . || ర్మల | ము ; || , ; | . ; ||
,, | పధమప || ,, | ,, || ని̣సా | గాగా || , ; | మాపా ||
,, | చి. . . || ,, | ,, || ర్మల | ము . || , ; | . . ||
,, | ,, || ,, | ,, || ,, | గాగా || గమా | పాపా ||
,, | ,, || ,, | ,, || ,, | ము ని || శ్చల | మ ని ||

, * పని | సనిధప ‖ మగా | గా ; ‖ మాపధపా | గరిసా ‖ , ; | ; ; ‖
, * ని. | న్నే. . ‖ న . | మ్మి; ‖ నా... | ను. . ‖ , ; | ; ; ‖

అ. , * గా | మాపా ‖ ని నీ | ధా ; ‖ పనీ | సానీ ‖ సస్సా | సాసా ‖
, * నా | చి . ‖ త్రము | వం ; ‖ చన | చం. ‖ చల | మ ని ‖

, * గా | మా ; ‖ మ నీ | నిధపా ‖ ,, | ,, ‖ ,, | ,, ‖
, * నా | చి ; ‖ త్రము | వం . ‖ ,, | ,, ‖ ,, | ,, ‖

, * గమ | పనీ, ‖ సనీరిసా | నినిధప ‖ పనీ | సగరిస ‖ రినీ | సాసా ‖
, * నా. | చి. , ‖ త్ర. . ము | వం. . ‖ చన | చం . . ‖ చల | మ ని ‖

, * నిస | మగరిస ‖ నిధా | పమగమ ‖ పా | ; – పస ‖ నిధప | మగరిస ‖
, * నను | వి . డ . ‖ నా. | డ . క. ‖ మా | ; – శ్రీ. ‖ రా. | మ... ‖

, * గమ
, * నీ. (చిత్రము)

చ. , ✻ పధ | పామా ‖ గా, | మాపా ‖ ; - పని | సనిదప ‖ మగా | రీసా ‖
, ✻ గురు | వే చి ‖ ల్ల | గిం జ ‖ , - గురు | వే. భ్ర. ‖ మ . | గము ‖
, ✻ ని స | గామా | , ప మ | గరిసా ‖ , - ని స | గమపా ‖ పపా | పాపా ‖
, ✻ గురు | దే భా | , స్క. | రుడు ‖ , - గురు | దే. ప ‖ రుస | వే ది ‖
, ✻ గ గ | మా పా | ని నీ | ధాపా ‖ , - పని | సగరిస ‖ సరిని | సాసా ‖
, ✻ గురు | దే యు | త్తమ | గ తి ‖ , - గురు | వు. నీ . ‖ వను. | కొంటి ‖
, ✻ నిస | మగరిస | రి నీ | సాసా ‖ సా, | నిధపమ ‖ గా , | రీసా ‖
, ✻ ధర | ను .. దా | సు ని | బ్రో వ ‖ ద్యా, | గ . రా ‖ జ , | నుత ‖

---

అవతారిక:—ఇందు త్యాగయ్యగారు, 'తేనవినా తృణాగ్రమపి నచలతి' అనఁగా భగవంతుని ఆజ్ఞ లేక ఒకగడ్డి పరకయు కదలదు. అనునటులు నిరంకుశమగు నాజ్ఞను వహించి సృష్టిమొదలు కొని మోక్షము నిచ్చువఱకు నేకదీక్షనుబూనినవాఁడవు. నేనీదాసులకు దాసుఁడనని దగ్గఱఁజేరితిని. అట్టి వానిని రక్షించుటకేల సందేహమని వేఁడుచున్నారు.

(41) ధన్యాసి - చాపు.

ప. శ్రీరామ దాసదాసోహం అన - నీరజనేత్ర నీకేల సందేహం (శ్రీ)

చ. గట్టుకానరాని గుంట రామ - పట్టుక దాటను నీపేరు తెప్పాట (శ్రీ)

2. కామాది నక్ర బాధ దీర్ప - రామయ్య నీచేతి చక్రము లేద (శ్రీ)
3. చలచిత్తమను నలలకు రామ - కలదు నీ వామహస్తమ్మోలతలకు (శ్రీ)
4. మదమత్సరము లనుగజము లకు నీ - పదకమలాంకుశ రేఖ అంకుశము (శ్రీ)
5. శోకాదు లనుపర్వతము లకు - నీకరాంకితవజ్ర రేఖ వజ్రము (శ్రీ)
6. అహామను జడత్వ మణంచి ప్రోవ - సహాజవహా నీచేతి శరములు తలంచి (శ్రీ)
7. దుష్కర్మములను మబ్బులెగయ నేయ - నిష్కల్మష పవనజుడుండు సదయ (శ్రీ)
8. జనన మరణములను సుడిని నిల్ప - ఘనమైన నీ యాజ్ఞసంపు నే వడిని (శ్రీ)
9. జాతి కొక్కరు కూడినారము ప్రీతి - చేతం జెలిలికొంటిమి నామసారము (శ్రీ)

10. పన్నగ భవ మతిఘోరము రామ - నిన్ను వినా అన్యదైవములను గోరము (శ్రీ)
11. వరగుణ రాజాధిరాజ రామ - పరమపావన పాలితత్యాగరాజ (శ్రీ)

ప్రతిపదార్థము.

నీరజనేత్ర - తామరరేకులవంటి కన్నుగలవాఁడా
శ్రీరామా - ఓరామా
అహం - నేను
దాసదాసః - నీదాసులకు దాసుఁడను
అన్నఁగా - అని చెప్పుచుండఁగా
నీవుఁగా - నీవు
సందేహము - అనుమానము
ఏల - ఎందుకు
రామ - ఓరామ
గట్టుగాన రానిగుంట - ఒడ్డు గనుపించని సంసారమనెడి గుంటను
పట్టుగాఁగా - దృఢముగా
దాఁటఁగా - దాఁటుటకు
నీపేరు - నీనామము
తెప్ప అంట - పడవయఁట
(శ్రీరామదాస)
రామయ్య - శ్రీరామా
కామాది నక్రబాధఁగా - కామము మొదలుగాఁగల ఆఱు శత్రువులనెడి మొసళ్ళయొక్క బాధను
తీర్పఁగా - తీర్చుటకు
నీచేతిచక్రము - నీకరమున వెలయుచున్న చక్రాయుధము
లేద - లేదా

రామ - శ్రీరామా
చలచిత్తమను నలలకున్ - చంచల చిత్తమనెడి తరంగములకు
నీవామహస్తము - నీయెడమచేయి
కలదు - ఉన్నది (కావున)
తలఁకు ఏల - భయమెందులకు ?
మదమత్సరములను గజములకున్ - మదముమత్సరము అను ఏనుఁగులకు
నీపద కమలాంకుశరేఖ - నీపాద కమలమునందలి అంకుశాకారముగల రేఖ
అంకుశము - అంకుశమే
శోకాదులను పర్వతములకున్ - శోక మోహములనెడి కొండలకు
నీ కరాంకిత వజ్రరేఖ - నీ హస్తములందు చిహ్నితమైన వజ్రమను రేఖయే

వజ్రము - వజ్రాయుధమువంటిది
అహమను జడత్వము - నేను అనెడి మాంద్యమును
అణఁచి - అణఁగఁద్రొక్కి
ప్రోవన్ - ప్రోచుటకు
సహజమౌ నీచేతిశరములు-కూడనున్న నీచేతి బాణములను
తలఁచి - ఆలోచించి
దుష్కర్మములను పబ్బు - పాపములనెడు పబ్బును
ఎగయనేయన్ - ఎగురఁగొట్టుటకు
సదయ - దయతోఁగూడిన రామా
నిష్కల్మషపవనజుండు-పాపరహితుఁడైన అంజనేయులు
ఉండున్ - ఉండును (శ్రీరామ)
జననమరణములను కుడిని - పుట్టుచావు లనెడి సుళ్లను
నిల్పన్ - నిలుపుటకు
ఘనమైన నీ యాజ్ఞను - గొప్పదియగు నీశాసనమును
వడిని - ప్రవాహవేగమునుగా

నేణ్ అందుకే ఏ - నేను అనువాఁడను (శ్రీరామా)
జాతికి - కులమునకు
ఒక్కరు - ఒకరు
కూడినారము - చేరితిమి
ప్రీతిచేతఁ - ప్రేమచేత
నామసారము - నీనామమందలి సత్తువను
తెలిసికొంటిమి - తెలిసికొన్నాము (శ్రీరామా)
పన్నుగఁ - పట్టుగా
భవము - సంసారము
అతిఘోరము - మిక్కిలి భయంకరమైనది

నిన్నుఁ వినా - నిన్ను తప్ప
అన్యదైవములఁ - ఇతర దేవతలను
కోరము - వేఁడము (శ్రీరామ)
వరగుణ - శ్రేష్ఠములైన గుణములు గలవాఁడా
రాజాధిరాజ - రాజులకెల్ల రాజైనవాఁడా
రామ - రామ
పరమపావన - మిక్కిలి పవిత్రమైనవాఁడా
పాలిత త్యాగరాజ - పాలింపఁబడిన త్యాగరాజు గల వాఁడా (శ్రీరామ)

విశేషార్థము:—సంసారము సముద్రమును బోలియున్నది. సముద్రమునందు మొసళ్లవలె నిందు కామాదులును, అందు అలలవలె నిందు చపలచిత్తములును, అందు నీటియేనుంగులవలె నిందు మదమత్సరములును, అందు కొండలవలె నిందు శోకాదులును, అందు జడత్వమువలె నిందు నేననుతలంపును, అందు సుళ్లవలె నిందు జననమరణములునుఉన్నవి. ఇట్టి పెద్దసముద్రమునందలి వస్తు

జాలముల స్వరూపమును నాశనముచేయుటకు తగిన కొన్ని సాధనములు నీ కడ నున్నవి. ఎట్లన, 'చక్రాక్రాన్తే గజేన్ద్రే' అనునటులు గజేంద్రునిబట్టి బాధించిన మొసలినిజంపిన చక్రాయుధము ఈ మొసళ్లను జంపలేదా అని భావము.

'చాపమానయ సౌమిత్రే' అనునటులు, లక్ష్మణా! ధనుస్సు తెమ్ము, అని చాచిన నీ యెడమ చెయ్యి అంతటి సముద్ర తరంగముల నిలిపియుండ ఈ యలలను నిలుపలేదా.

'ఏనుఁగునకు అంకుశ' మనునటులు ఈ యేనుఁగులను జంపుటకు నీ పాదమునందలి అంకుశ రేఖ లేదా.

పర్వతములకు వజ్రాయుధమువలె ఈ పర్వతముల నఱుకుటకు నీ కరమునందలి వజ్రరేఖ లేదా.

'శరాంశ్చాశీవిషోపమాన్, సముద్రం శోషయిష్యామి' అనునటులు సముద్రము తేమ లేకుండఁజేయునీ బాణములు ఈ నాజడత్వము నణఁచలేవా.

ప్రవాహముచేఁ గలిగిన సుళ్లను ప్రవాహమే నిలుపునటులు నీ యాజ్ఞచేఁ గలిగిన జనన మరణములను నీయాజ్ఞ నిల్పలేదా,

కావున, అట్లే యీ సంసారమందలి కష్టములను బాపి యీ సముద్రమును దాటింపఁజేయుటను, 'విష్ణుపోతం వినా నాన్యత్కించి దస్తి పరాయణమ్' అనునటుల నీవు తప్ప వేఱొక తెప్ప లేదు. నీవు సర్వాంతర్యామిగ నున్నను సులభముగ మావంటివారలకు దొరకవు గావున, 'వైకుంఠ నామగ్రహణ మశేషాఘహరం విదుః' అనునటులు సకలపాపహరమగు నీ పేరునే తెప్పగ పెట్టుకొని 'శ్వపచః పతితః కిరాతకోవా' అనునటులు కుక్కమాంసము తినువాఁడు, కిరాతకుఁడు, మఱియేవర్ణమువారలయినను భక్తులైనయెడల వారిని జేరి, అన్యదేవతల తెరువునకుఁ బోక సారముగు నీ నామమునే సదా ధ్యానించుచున్నాము అని అయ్యగారు పాడుచున్నారు.

ఇందుచే, 'మోక్షమిచ్ఛే జ్జనార్దనాత్' అనునటు లితరదేవతలు వారిచేతనైన స్వల్ప ఫలముల నియ్యఁగలరనియు, సంసారనిస్తారకమైన మోక్షము నిచ్చుటకు శ్రీమన్నారాయణుఁడు తప్ప వేఱొకఁడు శక్తుఁడు కాఁడనియు తెలియుచున్నది.

| ప. , * ధా | పా మా ‖ గా , | రీ సా ‖ ṅిసా | గా ; ‖ , ; | మా పా ‖ |
|---|---|---|---|---|---|---|---|
| , * శ్రీ | రా మ ‖ దా , | స దా ‖ సో. | హాం ; ‖ , ; | అ న ‖ | | | |

, ✻ మగ | మాపా ‖ పా , | పాపా ‖ మా , | గా-పమ ‖ గా , | రీ సా ‖
, ✻ నీ . | ర జ ‖ నే , | త్ర నీ ‖ కే , | ల -సం ‖ దే , | హం ‖
చ. , ✻ గమ | పామా ‖ , - గా | రీసా ‖ నిసా | గా ; ‖ , ; | మాపా ‖
, ✻ గ . | ట్టుగా ‖ , - న | రాని ‖ గుం | ట ; ‖ , ; | రా మ ‖
, ✻ గా | మాపా ‖ నీ , | సనిధప ‖ మగా | గా-పమ ‖ గా , | రీసా ‖
, ✻ ప | టుగ ‖ దా, | ట. నీ. ‖ పే. | ఘ - తె. ‖ ప్పం , | ట. ‖

(ఇతర చరణములును ఇదే మాదిరిగా పాడఁదగినవి.)

అవతారిక:—ఇందు అయ్యగారు 'సీతారామా! భక్తు లాశ్రయింపఁ దగిన కళ్యాణగుణము లుండుటచే నిన్నాశ్రయించితిని నన్ను కాపాడఁదగిన కృపాది గుణములుండియు నన్నేల కాపాడవు?' అని వేఁడుకొనుచున్నారు.

### (42) శుద్ధసీమంతిని - ఆది.

ప॥ జానకీరమణ భక్తపారి - జాత పాహి సకలలోకశరణ (జా)

అ. గానలోల ఘనతమాలనీల - కరుణాలవాల సుగుణశీల (జా)

చ. రక్తనళినదళనయన నృపాల - రమణీయానన ముకురకపోల

భక్తిహీనజనమదగజజాల - పంచవదన త్యాగరాజపాల (జా)

ప్రతిపదార్థము.

జానకీరమణ - సీతాదేవికి మనోహరమైనవాఁడా

భక్తపారిజాత - భక్తుల పాలిటి కల్పవృక్షమా

సకలలోకశరణ - సమస్తలోకములను రక్షకుఁడా

గానలోల - సంగీతప్రియుఁడా

ఘనతమాలనీల - గొప్పదగు చీకటి చెట్టువలె నల్లనైనవాఁడా

కరుణాలవాల - కరుణకు స్థానమైనవాఁడా

సుగుణశీల - మంచిగుణములు, స్వభావముగలవాఁడా

పాహి - కాపాడుము

రక్తనళిన దళనయన - ఎఱ్ఱ తామర రేకులవంటి నేత్రములు గలవాఁడా

నృపాల - రాజా

రమణీయానన - అందమైనముఖము గలవాఁడా

ముకురకపోల - అద్దములవంటి చెక్కిళ్లుగలవాఁడా

'భక్తి...పంచవదన'

భక్తిహీన - భక్తిలేని

జన - మనుష్యులనెడు

మదగజ - మదపుటేనుఁగులయొక్క

జాల - సమూహమునకు త్యాగరాజపాల - త్యాగరాజును కాపాడువాఁడా

పంచవదన - సింహమువంటివాఁడా

విశేషార్థము:—ఘనతమాలనీల, రక్తనళీన దళనయన, రమణీయానన, ముకురకపోల, సకల లోక శరణ, భక్తపారిజాత, అనునీ విశేషణములచే, ఓ రామా ! నీవు, ఒకటికన్న నొకటి పరభాగములైన అవయవ సౌందర్యములచే నొప్పిన దివ్యమంగళవిగ్రహమును గలవాఁడవు. 'త్రిజగతాం పతిధిపే' యనునటులు శత్రుమిత్ర విభాగములేక యెల్లరకు రక్షకుఁడవై, అందు భక్తులకు విశేషించి కల్పవృక్షమువలె కోరిన కోర్కెల నిచ్చువాఁడవై వారు పాడెడి పాటలకు సాక్షి, సోలుచు కొండంత దోషములసయితము గోరంతగఁ జూపెట్టు కృప మొదలగు స్వభావ గుణములుగలవాఁడవు. నీమదివ్యమంగళ విగ్రహమును, స్వభావగుణములను యీనన్ను ఆశ్రయించుమని వ్యామోహపెట్టుచుండఁగా నిన్నాశ్రయించితిని. 'ఈశ్వరస్సర్వభూతానామ్.' అనునటులు సమస్తభూతములకు నియామకుఁడనై కర్మానుసారము రక్షించు నేను నీవాశగొన్న మాత్రమున ని న్నెట్లుకాపాడెద ? అనినచో, భక్తిహీన, యిత్యాదులచే, 'యేహ్యాభక్తా జనార్దనే' అనునటులు వర్ణాశ్రమాచార

ధర్మము లెన్నిగల వారలైనను నీయందు భక్తిలేనియెడల వారే శూద్రులనియు, శూద్రులైనను నీయందు భక్తిగలిగిన, 'విప్రా భాగవతా స్స్మృతాః' అనఁగా వారే విప్రులు, భాగవతులు అనియు ప్రసిద్ధిగదా? అటులే నీయందలి భక్తి మహిమచే దోషరహితుఁడుగ నుండువానిని రక్షించుట కేమి యోచన అనిభావము.

జానకీరమణ, అను విశేషణముచే నాయం దలిదోషములనుగాని నీయందలి స్వాతంత్ర్యమును గాని తలయెత్త నీయకుండుటకు నాతల్లి సీత ప్రక్క-నే యున్నది. ఇట్టి రక్షణసామగ్రి యంతయు చేరియుండినందున దాసుని రక్షించుట సుకరమని అయ్యగారు శ్రీరామునితో హెచ్చరిక చేయుచున్నారనిభావము.

శుద్ధ సీమంతిని రాగలక్షణము:—ఈ రాగము 8-వ మేళమైన హనుమతోడియందు జనించినది. షాడవరాగము. నిషాదము వర్జ్యము. సాధారణ గాంధార శుద్ధ ధైవతములు రాగచ్ఛాయా సర్వములు. ఎల్లప్పుడును గానము సేయఁదగినది.

| ఆరోహణము. | అవరోహణము |
| --- | --- |
| స రి గ మ ప ధ స. | స ధ ప మ గ రి స. |

ప. గా ; రీసా ; ; ; – ధా. | సాసా ; – సా | రీగా ; మా ||
జా ; న కీ ; ; ; – ర | మ ణ ; – భ | క్తపా ; రి ||

పా ; పా – పాధాపా – మాగా | గా – సపధపపమ | గా – గరిసారీ ||
జా ; త – పా . హి – స క | ల – లో. . . . క | . – శ. రణ ||

2. గా; రీ – సరిగరి – రిససా – ధా. | సాసా ; – పా | రీ గా ; మా ||
జా ; న – కీ ... – ... – ర | మ ణ ; – భ | క్తపా ; రి ||

పాధాపా – మాపామా – గారీ | గా – సపధపపమ | గరి – సారీగా ||
జా . త – పా . హి – స క | ల – లో. . . . క | . . – శ రణ ||

పమ – గారీసరిగరి – రిససా – ధా. | సాసా ; ; | ; ; ; ; ||
జా. – . నకీ ... – ... – ర | మ ణ ; ; | ; ; ; ; ||

అ. పా ; పా – పా ; పా – మాపా | ధా – సో ; సో | రీగా – రీసో ||
గా ; న – లో ; ల – ఘ న | త – మా ; ల | నీ . – ల . ||

2. ,, | ,, | సరిగరి - గారిస ||

,, | ,, | నీ . . . - ల . . ||

,, | ,, | సా ; ; సా ||

,, | ,, | నీ ; ; ల ||

గా , రీ , సా ; సా - ధాపా | ధా - పధపామా | గారీసారీ ||

క , రు , ణా ; ల - వా . | ల - సు. గు ణ | శీ . . ల ||

,, | ధా - మగపమధప | దధపమగరిసరి ||

,, | ల - సు. గు. ణ. | శీ . . ... ల. ||

గా ; రీసా ||

(జా; న కీ రమణ) ||

చ. మా ; మా - మామామా - మాగా | మాధాపామా | ప మగారీసా ||

ర ; క్త - న ళి న - ద ళ | న య న న్న | పా . . . ల ||

సరిగమ - పమగా - రీ ; సాసా | సాధ్దాసారీ | గా ; మామా ||
ర . మ. - ణీ. . - యా; న న | ము కు రక | పో ; . ల ||

పా ; పా - పా ; పా - మాపా | మాపాధాసా | ః గారిసా ||
భ ; క్తి - హీ ; న - జ న | మ ద గ జ | జా . . ల ||

గా ; ః - గారిసా - ధాసా | ధా - మగపమధప | దధపమ - గరిస ఽ ||
పం ; చ - వ ద న - త్యా . | గ - రా . . . . జ | పా . . - . . . ల ||

గా ; రీసా ||
(జా; న కీ రమణ) ||



అవతారిక.—ఇందు త్యాగయ్యగారు, బూటకపు భక్తులు రామభక్తి మార్గమును నిజముగా కనలేరనియు, లోకులు వారివేషమును జూచి మోసపోవుచున్నారనియును నిరూపించుచున్నారు.

(43) ధేనుక - దేశాది.

ప. తెలియలేరు రామ - భక్తిమార్గమును (తె)

అ. ఇల నంతటఁ దిరుగుచును - గలువరింతురే గాని (తె)

చ. వేగ లేచి నీట మునిఁగి భూతిఁ బూసి - వ్రేళ్ళనెంచి వెలికి శ్లాఘనీయులై
† బాగుగ విత్తార్జనలోలురై - రే గాని త్యాగరాజనుత (తె)

ప్రతిపదార్థము.

ఇలన్ - భూమియందు
అంతటన్ - అన్ని ప్రదేశములయందును
తిరుగుచున్ - తిరుగుచును
కలువరింతురు ఏ కాని - కలువరించెదరే కాని
భక్తిమార్గమును - భక్తిమార్గమును
తెలియలేరు - తెలిసికొనఁజాలరు
(లోకులని) అధ్యాహారము

వేగన్ - వేకువనే
లేచి - నిదురలేచి
నీటన్ - నీటియందు
మునిఁగి - స్నానముచేసి
భూతిన్ పూసి - విభూతిని పూసికొని
వ్రేళ్లనెంచి - వ్రేళ్లను లెక్కపెట్టి
వెలికిన్ - బయటికి

† 'బాగుపైక మార్జన అనునొక సామాన్య పాఠముగలదు.

శ్లాఘనీయులై - కొనియాడఁ దగినవారై
బాగుగన్ - చక్కఁగా
విత్త - ద్రవ్యముయొక్క

అర్జన లోలురు ఐరి ఏ కాని - సంపాదించుట యందు
ఆసక్తిగలవారలైనారే తప్ప
త్యాగరాజ నుత - త్యాగరాజుచే కొనియాడఁ బడు
రామ - శ్రీరామ (భక్తిమార్గమును తెలియలేదు)

విశేషార్థము:—'మీనః స్నానపరః ఫణీ పవనభు గ్మేషస్తు పర్ణాశనో। నీరాశీ ఖలు చాతకః ప్రతిదినం శేతే బిలే మూషకః। భస్మోద్ధూళనతత్పరః ఖలు ఖరో ధ్యానాధిరూఢో బకః' అనఁగా, స్నానమే మోక్షసాధనమన్న, చేఁప సదా స్నాన మొనర్చుచున్నది. వాయుభక్షణమే మోక్ష సాధనమన్న, పాము ఎల్లప్పుడును గాలిని తినుచున్నది. పర్ణభక్షణ మెక్కువన్ననో మేఁక ఆకులనే మేయుచున్నది. జలపానమే శ్రేష్ఠమన్ననో చాతకము సదా నీరే త్రాగుచున్నది. బిలనివాస ముత్తమ మన్ననో ఎలుక యెపుడును బిలముననే నివసించుచున్నది. విభూతి పూఁత యెక్కువ యన్ననో గాడిద సదా బూడిదయందే పొర్లాడుచున్నది. ధ్యానము సదా మంచి సాధనమన్ననో కొంగ సదా యోజనతోనే యున్నది. అనునటులు, లోకులు ప్రొద్దుప్రొద్దున

లేచి నీట మునిఁగి విబూదిపూసి వ్రేళ్ల లెక్కపెట్టి జపమొనర్చిన మాత్రమున నుత్తములయిరా? కారు. ఇటువంటివారలు పరులను వంచించి ద్రవ్యార్జనమందు మాత్రము శ్రేష్ఠులయిరి. 'జ్ఞాన ప్రధానం తపః' అనునటులు నిశ్చలమగు జ్ఞానముచేతనే భగవద్భక్తి నార్జింపవలనే గాని బూటక మగు తపస్సులచే నిజమైన భక్తి రాఁబోదు. అట్టి జ్ఞాను లెవరో వారే పరమాత్మ నెఱుంగుదురు గాని అన్యుల కసాధ్యమని అయ్యగారు తెలుపుచున్నారు.

ధేనుక రాగలక్షణము:—ఇది 9-వ మేళకర్త సర్వస్వర సంపూర్ణ గమక వరిక రక్తి రాగము. ప్రాతః కాలమునందు గానము సేయఁదగినది. సాధారణగాంధార కాకలీ నిషాదములు రాగచ్ఛాయా స్వరములు. ఇందుఁ గల గాంధారమును కొంచెము దీర్ఘముగ నుపయోగించినచో రక్తి గలుగును. ఈ రాగమును వేంకటమఖిగారు భిన్నషడ్జమని చెప్పియున్నారు.

| ఆరోహణము. | అవరోహణము |
|---|---|
| స రి గా మ ప ధ ని స. | స ని ధ ప మ గా రి స. |

ప. ; ; ; * ప ధపమ - గా ; రీ | సా , సా , - నీ | సారీగామా ||
; ; ; * తెలియ. - లే ; రు | రా , మ , - భ | క్తిమా. గ్గ ||

గా , మా , * ,, | ,, | ,, ||
ము , ను , * ,, | ,, | ,, ||
పాపమగమ * ,, | ,, | ,, ||
ము . ను. . * ,, | ,, | ,, ||

పధానీ , * ధ పమా - గా ; రీ | ,, | ,, ||
ము. న , * తెలియ - లే ; రు | ,, | ,, ||

పా , పా , * ,, | రీ , సా , - ; | ; ; - ; ; ||
ము , న , * ,, | రా , మ , - ; | ; ; - ; ; ||

అ. ; ; ; * దాధానీ ; నీ | స్సాం ; ; - స్సాం | రీగ్గాంరీస్సాం ||
; ; ; * ఇ ల సం; త | టు ; ; - ది | గుతు. . ||

నీధాపా * ,, | ,, | శ్రీసరిగాశ్రీ ||
చుసు . * ,, | ,, | రుగు. . . ||

సనిధాపా * ,, | ,, | ,, ||
చు. ను. * ,, | ,, | ,, ||

సా , సా , * సరిసనిధా ; నీ | సా ; ; - ధని | సనిధాపామా ||
చు , ను , * క. లు. వ ; రి | తు ; , - రే. | . . గా . . ||

గా , మా , *
. , ని , * (తెలియలేరు)

చ. ; ; ; * పాపాపా ; మా | ధపధా ; - ప ధ | పమగా ; రీ ||
; ; ; * వే గ లే ; చి | నీ . ట ; - ముని | గి . భూ ; తి ||

సా , సా , * పామాగా ; రీ | సన్సా , - సా | రీగా ; మా ||
బూ , నీ , * ప్రేళ్లె నెం ; చి | వెలికి , - క్లా | ఘనీ ; యు ||

పా ; ; * దాధానీ ; నీ | సాం ; ; సాం | రిగాంస్థాంర్లీ ||
లై ; ; * బా గుగ ; వి | త్వా ; ; గ్జ | న లో . లు ||
సాం ; ; * సరిసనిధా ; నీ | సాం , సాం , - ధని | సనిధాపామా ||
రై ; ; * కే...గా ; వి | త్యా, గ , - రా | . ... జ ||
గా , మా , *
ను , త , *

---

అవతారిక:—ఇందు త్యాగయ్యగారు, రామా! లోకులు నాభక్తిని, నన్నును అసూయచే పరిహసించుచున్నారు. నీవును అందులకు దగినట్లుపేక్షించినటులే తోచుచున్నది. ఇట్లు స్వీయ, పరకీయ విభాగము లేకుండుట న్యాయమా అనుచున్నారు.

(44) భిన్నషడ్జము - దేశాది.

ప. సరివారిలోనఁ జౌక చాలదా? నాం (స)

అ. పొరుగిండ్ల వారలచేతి - పూజ జూచిచల్లనాయెనా (స)

చ. తారుమాఱు పల్కు వారిలోఁ - దత్తరింపఁగఁ జూడ న్యాయమా (స)

పారమార్థికుల దుఃఖజాలమును - బాపలేద శ్రీత్యాగరాజనుత (స)

ప్రతిపదార్థము.

నా - నాయొక్క

సరివారిలోనఁ - సమానులలోపల

చౌక - చులకన

చాలదు ఆ - చాలదా

పొరుగిండ్ల వారల చేతిపూజ - పొరుగింటివారి చేయుపూజ

చూచి - చూచి

చల్లన ఆయెఁ ఆ - చల్లగ నాయెను

తారుమాఱు - తల్లక్రిందుగా

పల్కు వారిలోన - మాట్లాడువారిలోపల

తత్తరింపఁ గఁ - నేను విచారపడునట్లు

చూడఁ - నీవు చూచుట

న్యాయమా - యుక్తమా

పారమార్థికుల దుఃఖజాలమును - నిజమైన భక్తి గల వారలయొక్క చింతాసముదాయమును

శ్రీత్యాగరాజనుత - భక్తి సంపదగల త్యాగరాజుచే కొనియాడఁబడు రామా

బాపలేదు ఆ - పోఁగొట్టలేదా

విశేషార్థము: పొరిగిండ్ల వారిచే [illegible] ఇత్యాదులచే, 'స్తోష్యామి న కులధనం కుల వతిక్ష్వ' అమనటు [illegible] కు పైతృక ధన [illegible] ను, కులదేవతగను నమ్మి సదా పూజించుచున్న సంగతి

కొంచెపాటి పూజలకే తృప్తిఁ జెందితివా ? విచారింపకయే యిరుగింటి పొరుగింటివారలు చేయు దూరు! తారు ఇట్లు తనవాఁడు, పరుఁడు అను విచారణములేక, నీ వుండ నా మనస్సెట్లు తల్లడిల్లును! అని భావము. మారుగాఁ బలుకువారితోపాటు నేనును నిన్నుగుఱించి చెప్పవలసి యుండునుగదా ? అనిభావము.

'సరివారిలోన నిత్యాదులచే, శ్రీరామా! 'దన్తి గౌతమవధూ విభీషణ ద్రౌపదీ ప్రభృతి దీనరక్షణా, రఘునేత్రవిమలం యశోమయాదీన యాదృశములనీకరిష్యతే' అనుసటుల గజేంద్రుఁడు, అహల్య, విభీషణుఁడు, ద్రౌపది మొదలైనవారలను ఆపదనుండి తొలఁగించి, అప్పుడు సంపాదించిన నీకీర్తి అపరిమితమై యున్నది. దీనుఁడనై ధైర్యముతో నీ పాదారవిందములను నమ్మిన నన్ను కా పాడనియెడల నన్ను సరివారలలో అవమానపడుచుటయే గాక నీ వార్జించిన కీర్తియు మలిన మైనయదిగాఁ జేయుదువు అని భావము.

భిన్నషడ్జ రాగలక్షణము:—ఇది 9-వ మేళమైన ధేనుకయందు జనించినది. వక్ర సంపూర్ణ రాగము. శుద్ధ ఋషభ సాధారణ గాంధార కాకలీ నిషాధములు రాగచ్ఛాయా స్వరములు. ఎల్ల ప్పుడును గానము చేయఁదగినది. ఈ రాగముయొక్క ఆరోహణమునందు 'గరిమా' అను ప్రయో గమును, అవరోహణమునందు 'సనిసధ' అను ప్రయోగమును గనఁబడుచున్నవి.

ఆరోహణము. అవరోహణము.

స రి గ రి ప మ ప ని స. స ధ ప మ గ రి స.

ప. ; ; ; * సారీ - సా ; మా | పా , పా , - ధా | సామాగారీ ||
; ; ; * స రి - వా ; రి | లో , న , - జా | క చా . ల ||
సా , రీ ని * సరిగా - రీపామా | ,, | ,, ||
దా , నా. * స. రి - వా. రి | ,, | ,, ||
,, * ,, | పనిపనిసా - ధా | ,, ||
,, * ,, | లో. . న - జా | ,, ||
,, * ,, | పనిపనిసరీ - సరీ | గరీ - సారీసా ||
,, * ,, | లో. . న . - జా | క . - చా . ల ||
ధపా మగరి * ||
దా. నా.. * (సరివారి)

అ. ; ; ; * పానీస్రాం ర్ణనీ | సా ; ; - సా | ర్ణగాం ర్ణసా ||
; ; ; * పొరుగిం . డ్ల | వా ; ; - ర | లచే . . ||

ధాపామా * ,, | ,, | ,, ||
లి . * ,, | ,, | ,, ||

ర్ణ , సా , * ర్ణసా - ధాపామా | పానీసా - ర్ణ | సాధా పామా ||
ది , . , * ఖ్యాజ - చూ , చి | చ . ల్ల - వా | . . . రియ ||

గా , రిసని *
నా , . . . * (సరివారి)

చ. ; ; ; * పామాపాం ; మా | ధా ; ; - పధ | పమ గా ; రీ ||
; ; ; * తారు మా ; అు | గా ; ; - బలు | రియ. వా ; రి

సా , నీ . * ,, | పనిసా ; - ప ధ | ,, ||
శాన్ , . , * ,, | గా . ; - బలు | ,, ||

| | | | |
|---|---|---|---|
| సారీ ; | * గరిపమగా ; రీ | \| సా ; ; - రీ | \| రీ - పా ; మా \|\| |
| లో. ; | * ద. త్త. రిం ; ప | \| గ ; ; - జూ | \| ద - న్యా ; య \|\| |
| ధపాధా , | * పానీస్సా ; నీ | \| స్సా , స్సా , - సరీ | \| గాస్సాక్రినీ \|\| |
| మా. . , | * పార మా ; ధ్రి | \| ను , ల , - దు: | \| ఖ జా. ల \|\| |
| స్సా , స్సా , | * రీస్సాధాపామా | \| పానీస్సా - సరీ | \| స్సాధాపామా \|\| |
| ము , ను , | * బాప లే . ద | \| శ్రీ . . . - త్యా | \| గ రా. జ \|\| |
| గా , రీసని | * | | |
| ను , త.. | * (సరివారి) | | |



అవతారిక:—ఇందు త్యాగయ్యగారు సద్యోమోక్షమునకై భగవంతు నాశ్రయించెను. భగవంతుఁ డొనర్చు ప్రారబ్ధ కర్మ విచారముచే తనకు పరాకుచేసినట్లు దోఁచఁగా, రామా! నా ప్రార్థనను వినియు విననట్లు నటించి కాలహరణ మొనర్చిన నీకేమి ఫలము? ఒక్కొక జీవుని నత్యంత శీఘ్రముగ నుజ్జీవింపఁ జేసినంగదా నీకు కీర్తియని హెచ్చరిక చేయుచున్నారు.

(45) జుజాహుళి - ఆది.

ప. పరాకు చేసిన నీకేమి - ఫలము కలిగెరా పరాత్పరా (ప)

అ. సురావనీసురాప్త మా - వరాజరాపఘున నాయెడ (ప)

చ. ముదాన నీదు పదారవింద - ములను బట్టి మ్రొక్కఁగ లేదా
నిదానరూప దరిదాపు లే - దుదార శ్రీ త్యాగరాజనుత (ప)

ప్రతిపదార్థము.

పరాత్పరా - సర్వాధికారివగు శ్రీరామా
(సురావనీ సురాప్త)
సుర - దేవతలకును
అవనీసుర - బ్రాహ్మణులకును
ఆప్త - హితుఁడవయినవాఁడా
మావరా - లక్ష్మీనాథుఁడా
(అజరాప ఘనా)

అజర - ముసలితనములేని
అపఘనా - దివ్యమంగళ విగ్రహముగలవాఁడా
నాయెడన్ - నా విషయమున
పరాకు - అజాగ్రతను
చేసినన్ - చేసినయెడల
నీకున్ - నీకు
ఏమిఫలము - ఏమిలాభము

కలిగెగా రా - కలిగెనయ్యా

ముదానగా - సంతోషముతో

నీదు పదారవిందములను - తామరపూలవంటి నీదు పాదములను

పట్టి - ఆశ్రయించి

మ్రొక్కగా కదా లేదా - నమస్కరింపలేదా

నిదానరూప - ఆదికారణమైన రూపముగలవాడా

ఉదార - తేజముగలవాడా

శ్రీత్యాగరాజనుత - త్యాగరాజుచే కొనియాడఁబడువాఁడా

దరిజూపు - దగ్గఱ కనుపించుట (గన్పట్టనటులు)

లేదు - లేదు

విశేషార్థము:— ఇందు అనుపల్లవిచే, రామా! నీవు సురలకును, భూసురులకును ఆప్తుఁడవు మఱియు నాతల్లియగు లక్ష్మి నిన్ను ఎడఁబాయకున్నది 'అచింత్య దివ్యాద్భుత నిత్య యౌవన స్వభావ లావణ్యమయామృతోదధిం' అనునటులు, అవాఙ్మానస గోచరమైన చక్కఁదనముగల నిత్య యౌవన దివ్యమంగళ విగ్రహమును, 'భక్తానాం త్వం ప్రకాశసే' అనునటులు భక్తులకుగా ధరించి ప్రకాశించుచున్నావు. ఇట్లుండియు దొరకక దొరకక ఒకభక్తుఁడు దొరకినప్పుడు ఏల మీన మేషములలెక్కించి కాలహరణ మొనర్చుచున్నావని భావము.

మఱియు (చరణముచే) ఒద్దఁ జేరిన నేమి? శరణాగతుల కుండవలసిన లక్షణములన్నియు చక్కఁ

 గనున్నం గదా రక్షింతునంటివేని, సర్వమును విడిచి నీపదములనే పట్టి యుంటినిగదా ? చేతులను బట్టి అడుగుకొన్నను, నీవు విదలించుకొని పోవచ్చును అట్లు గాక 'సభ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః' అనునట్లు నీవరణ్యమున కేగుచున్నపుడు సీతమ్మ్యుడు నీ పాదములను పట్టినటులే నేనును పాదములే పట్టి యున్నానుగదా ? ఆనాఁడు సీతమ్మని కార్యము నెఱవేర్చు టేల ? ఇప్పుడు నన్ను విడనాఁడుటేల ? నీ యుపేక్షా భావము చూడఁగా, ఏ-టికిని నేను గట్టెక్కునట్లు దోఁచ లేదే ! యాచకుల కోర్కెలను ముందువెనక యోజింపక నెఱవేర్చు ఉదారస్వభావుఁడవైన నీవు, ఇట్లు మధనపడఁదగునా ? ఏల పడాకని భావము.

జుజాహుళి రాగలక్షణము:—టడి పాడవ స్వరరాగము. 28-వ మేళమైన, 'గానవిప్రియ' అను రాగమునందు జనించినది. శుద్ధ మధ్యమ శుద్ధ ధైవతములు రాగచ్ఛాయా స్వరములు. ఋషభము వర్జ్యము. ఎల్లప్పుడును గానము సేయఁదగినది.

ఆరోహణము.

స మ గ మ ప ధ ని స.

అవరోహణము.

స ధ ని ధ ప మ గ స.

N. B.:—ఈ రాగమునందు, 13-వ మేళకర్త ప్రకారముగ నుండవలసిన శుద్ధధైవత శుద్ధ నిషాదములు ఇప్పటి వాడుకయందుఁ గనబడఁలేదు. ఇప్పుడు ఇందు కైశికీ నిషాద చతుశ్శ్రుతి ధైవతములే ఉపయోగింపఁ బడుచున్నవి.

ప. ధానీ ; ధా - పా ; - ; ; ‖ మాగా - సా : | మాగా - మా ; ‖
పరా; కు - జే ; - ; ; ‖ సిన - నీ ; | కే . - మి ; ‖

2. ధానీ ; ధా - పధనిధపా ; - ‖ మాగా - పా ; | పా ; - ; పా ‖
ప రా; కు - జే.... ; - ‖ సి న - నీ ; | కే ; - ; మి ‖

మాగామా - పానీధా - సనినిధ ‖ మానీ - ధా నీ | సా ; - ధనిసా ‖
ఫ ల ము - గ లి గె - రా.. ‖ పరా - . త్ప | రా ; - . . . ‖

అ. మాధా ; నీ - సా ; - ; ; ‖ సా ; - ; ; | నిసరిస - నిధపమ ‖
సు రా ; వ - నీ ; - ; ; ‖ . ; - ; ; | . . . . - . . . . ‖

,, ‖ పాసా ; - సా | మా ; - ; ; ‖
,, ‖ సు రా ; - త్త | మా ; - ; ; ‖

మగపమ - మాగా - సా ; ; ; ‖ ; - సామాగా | సా , మ - గాసా ‖
వ . ర . - . జ - రా ; ; ; ‖ ; - ప ఘ న | నా , . - యెడ ‖

చ. పాపా ; పా - పా ; ; పా ‖ మగపమ - మా , గ | మా ; - ; మా ‖
ముదా ; న - నీ ; ; దు ‖ ప. దా. - . , ర | విం ; - ; ద ‖

మాగాసా - మాగామా - పా ; ‖ నీ ధా - సనినిధ | పా ; - ; ; ‖
ము ల నం - ప . ట్టి - (మెం ‖ క్ర - గ - లే. . . | దా ; - ; ; ‖

మాధా ; నీ - సా ; సా - ధా ‖ నీసా ; - సా | మా ; ; - మా ‖
ని దా ; న - రూ ; ప - ద ‖ రి దా ; - పు | లే ; ; - దు ‖

మగపమ - మా , గసా ; ; ; ‖ మాగాసా - సా | , మ - మాగాసా ‖
ఉదా. ర - శ్రీ , . . ; ; ; ‖ త్యా . గ - రా | , . - జ ను త ‖



అవతారిక:—ఇం దయ్యగారు తా మొనర్చు రామచంద్రుని కైంకర్యమునకు విఘ్నము గలిగిన యొక సమయమున "భగవంతుఁడు ఒకరి కార్యముల నంతము తన పనిగఁ జూచుకొని స్వకార్యమునైనఁ బాడుచేసికొని కటాక్షించువాఁడు. అట్టివాఁడు నాయెడల ఇపుడు కరుణమాలియున్నవాఁడు మఱియు 'బ్రహ్మవిదాప్నోతి పరం' అనగా బ్రహ్మజ్ఞానము గలవాఁడు పరబ్రహ్మమును బొంగుచున్నాఁడు అని యున్నది. అట్టి బ్రహ్మను నెఱుంగక అన్యథా జ్ఞానముగలిగి శ్రీరాముఁడు గానివాని నే రాముఁడని తలఁచియుంటినో ? లేక నేనొనర్చు పూజలే విధివిహీతము కాలేవో ? ఇట్టి వైపరీత్య మేదైన నుండవచ్చు. లేకున్న నన్నేల కరుణింపఁడు" అని చింతిల్లుచున్నారు.

(46) వకుళాభరణము - త్రిపుట.

ప. ఏరాముని నమ్మితినో నే - నేపూలఁబూజ చేసితినో (ఏ)

అ. వారిము నిజదాస వరులకు రిపులైన - వారి మదమణఁచు శ్రీరాముఁడు కాఁడో (ఏ)

చ. ఏకాంతమున సీత సోకార్చి జో కొట్ట - కాకాసురుఁడు చేయు చీకాకు సైరించు
కోక మదిని దయలేక బాణమునేసి - యేకాక్షునిజేయు సాకేతపతి గాఁడో (ఏ)

2. దారపుత్రులయొద్దఁ జేరనీక రవికు - మారుని వెలువటఁ బాఱఁదోలి రుమఁ (ఏ)
జేరఁ జీరినట్టి తారానాయకుని సం - హారము చేసిన శ్రీరాముఁడు గాఁడో

3. రోషమున నాడు భాషలనుపని వి - భీషణుఁడా వేళ ఘోషించి శరణన (ఏ)
దోషి రావణు మదశోషకుఁడైన ని - ర్దోష త్యాగరాజ పోషకుండు గాఁడో

ప్రతిపదార్థము:

ఏరాముని౯ - ఏరాముని
నమ్మితి౯ ఓ - నమ్మితినో
నే౯ - నేను
ఏ పూల౯ పూజ - ఎటువంటి పూవులచేతను పూజ
చేసితి౯ ఓ - ఒనర్చితినో
వారము - మాటికిని
నిజదాస వరుల౯ - తనభక్త శ్రేష్ఠులను
రిపులైనవారి మదము - శత్రువులైనవారియొక్క మదమును

అణఁచు శ్రీరాముఁడు - పోఁగొట్టు శ్రీరాముఁడు
కాఁడో - కాఁడేమో
ఏకాంతమున౯ - రహస్య సహాయమున
సీత - సీత
సాహసోర్చి - కాకాసురుఁడు పెట్టుకష్టమును సహించి
జోకొట్టఁ - నిద్రపుచ్చఁగా
కాకాసురుఁడు చేయు చీకాకు - కాకాసురుఁడు పెట్టు శ్రమను

సైరించుకోక - ఓర్చుకొనక
మదిని - మనస్సునందు
దయలేక - కృపలేక
బాణముఁ ఏసి - బాణము ప్రయోగించి
ఏకాక్షునిజేయు సాకేతపతి - కాకాసురుని ఒంటికంటి
వానిగా చేయు శ్రీరాముడు
కాదు ఓ - కాదేమో
రవికుమారునిఁ - సుగ్రీవుని
దారపుత్రులయొద్దఁ - భార్యాపుత్రుల సమీపమున
చేరనీక - చేరనీయక
వెలుపటఁ - బైట
పాఱఁదోలి - వెడలఁగొట్టి
రుమఁ - రుమయను సుగ్రీవుని భార్యను
చేరఁ - చేరుటకు
చీరినట్టి తారానాయకునిఁ - పిలిచినట్టి వాలిని
సంహారముచేసిన శ్రీరాముఁడు - చంపినట్టి శ్రీరాముఁడు

కాదు ఓ - కాదేమో
రోషమునఁ - ఆగ్రహముచేత
ఆడుబాసలను - పలుకునట్టి పలుకులను
విని - విని
విభీషణుఁడు - విభీషణుఁడు
ఆవేళఁ - ఆ సమయమున
ఘోషించి - అఱచి
శరణు అనఁ - రామా నీవే దిక్కనఁగా
'దోషి...పోషకుఁడు'
దోషిరావణు - పాపియగు రావణునియొక్క
మదశోషకుఁడైన - మదమును పోగొట్టినవాఁడును
నిర్దోష - పాపరహితుఁడైన
త్యాగరాజ పోషకుఁడు - త్యాగరాజును పోషించునట్టి
రాముఁడు
కాదు ఓ - కాదేమో

విశేషార్థము:—'వారము' ఇత్యాదులచే భగవంతుఁడు, 'దేవానాన్దానవానాంచ సామాన్య మధిదైవతం' అనునటులు దేవతలకును రాక్షసులకును, పొత్తుగనుండు దైవమయ్యును తన భక్తులకు అపకార మొనర్చుటచే శత్రుమిత్ర భేదమును వహించియున్నవాఁడు: ఉదాహరణముగ 'ద్విషదన్నం నభోక్తవ్యం ద్విషన్తం నైవ భోజయేత్ । పాండవాన్ద్విషసే రాజన్ మమప్రాణాహి పాణ్డవాః' అనునటులు దుర్యోధనుఁడు విందుచేయునప్పుడు కృష్ణుఁడు, దుర్యోధనా! నీవు శత్రుఁడవు. నీ అన్నము తినఁగూడదు. ఏలయన, నాకు ప్రాణసమానులగు పాండవులను ద్వేషించితివి గదా? అనిచెప్పి తన భక్తులయందు ప్రీతిని, భక్త విరోధులయందు ద్వేషమును జూపలేదా? నే నమ్మిన భగవంతుఁడు వాఁడే యైనయెడల కైంకర్య విరోధులగు నా శత్రువుల మదమణఁచి నన్నేల కరుణింపఁడు అనిభావము.

ఇందలి మూఁడు చరణములచే మూఁడు దృష్టాంతములు దెలుపుచున్నారు.

ఏకాంతమున నిత్యాదులచే, 'పరిశ్రమార్త్తౌ సుప్తౌచ రాఘవౌ జ్ఞ్యహంచిరమ్ । పర్యాయేణ ప్రసుప్తశ్చమమాఙ్కే భరతాగ్రజః' అనగా, చిత్రకూటాద్రియందు సీతారాములు,

ఒకరి యొడిలో నొకరు తలయుంచుకొని విహరించు వేళ రాముఁడు సీత తొడపై నుంచుకొని పరుండి నిద్రించుచుండఁగా కాకాసురుఁడు సీతను, 'స యస్మాత్ పర్యతుండయత్ నగా స్తన మాంసమును గొరి ముక్కునఁ బొడిచినను తన భర్తకు నిద్రాభంగము గలుగునే యనుశంకచే కాకాసురుఁడు పెట్టు కష్టములను సహించుకొనుచున్నను, 'తతస్సముక్షితో రామో ముక్తైశ్శోణిత బిన్దుభిః' అనగా, శ్రీరాముఁడు స్తనమండలమునుండి రాలు రక్తబిందువులు తన తక్కిలిపైఁ బడఁగా నుల్కిపడి లేచి మనస్సున దయాకు నించుకంతయు నవకాశమీయక, 'కేన తే నాగనా సోరు! విక్షతం వై స్తనాన్తరం। కః క్రీడతి సరోషేణ పంచవక్త్రేణ భోగినా॥' అనగా, ఓసీ . . ఎవఁడు నీ స్తన మండలమును వ్రణమండలముగఁ జేసె . . ను? అయిదుతలలు గలిగిన క్రూరసర్పముతో నెవఁడు ఆటలాడుచున్నాఁడు? అని మిక్కిలి గ్రహించి బ్రహ్మాస్త్రమును ప్రయోగింపఁగా వాఁడు ముల్లోకముఁ దిరిగిఁ వేఱొక్కదిక్కు గానక శ్రీరాముల పాదములప్రక్కఁ బడఁగా సీత, 'సతం నిపతితం భూమౌ శరణ్యశ్శరణాగతమ్। వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్॥' 'అనగ నాథా! వీఁడు చంపుట కర్హుండైనను శరణాగతుండై వచ్చి నీ పాదములయొద్ద వ్రా

లెను గనుక వీనిని కరుణతో రక్షింపుము అని పురుషకార మొనర్చ కాకాసురు నొక కంటిని మాత్రము గొట్టి వానిని రక్షించిన రాముఁడు నన్నేల రక్షింపడని భావము.

'దారపుత్ర' ఇత్యాదులచే వాలి, సుగ్రీవుని భార్యాపుత్రులయొద్ద లేకుండ నిల్లు వెడలఁగొట్టి రుమను జేపట్టినందులకు శ్రీరాముఁడు, 'రుమాయాం వర్తసే కామాత్ స్నుషాయాం పాపకర్మ కృత్' అనియు 'ఔరసం భగినీం వాపి, భార్యాం వాప్యనుజస్య యః। ప్రచరేతు నరః కామాత్ తస్య దండో వధస్స్మృతః' అనగా, ఓవాలి, నీవు తమ్మునిభార్యయగు రుమను కామపరవశుఁడవై అనుభవించితివి. అట్టి నీకు వధయే దండము. అని, వానిని వధించి సుగ్రీవుని కాపాడిన రాముఁడు నన్నేల కాపాడడని భావము.

రోషమున ఇత్యాదులచే విభీషణుఁడు, 'ప్రదీయతాం దాశరథాయ మైథిలీ' అన్నా! రావణా! సీతాదేవిని శ్రీరామునికి సమర్పింపుమని హితము నుపదేశింపఁగా, 'త్వాంతు ధిక్కులపాంసనమ్' అనగా, ఛీ! విభీషణా! మనకులము చెడఁ గొట్టితివి; అని నిందించిన రావణునిమాటలు విన్నతోడనే లంకారాజ్యమును సర్వమును వదలి వచ్చి, 'సర్వలోకశరణ్యాయ రాఘవాయ

మహాత్మనే' సమస్తలోకములకు దిక్కగు రామా! నిన్ను శరణు చొచ్చితినని మొఱపెట్టఁగా విభీషణునియందలి పక్షపాతముచే దుర్మార్గుఁడగు రావణుని జంపితివిగదా? ఇట్లు నీవు కాకాసురుని, ఏకాక్షునిగాఁ జేయుటయు, వాలిని రావణాసురుని వధించుటయు నీ యాశ్రితులయందలి ప్రేమ చేతనే గదా? నీవా రాముఁడవైనచో నిన్నాశ్రయించిన, యీ త్యాగరాజుపైని ప్రీతిచే నా విరోధి నిరసనమున్మాత్రము మేల చేయవు? కావున నీ వా రాముఁడవు గా వేమో యని అయ్యగారు శంకించుచున్నారని భావము.

వకుళాభరణ రాగలక్షణము:—ఇది 14-వ మేళకర్త. సర్వసర్వ సంపూర్ణ గమక వరిక రక్తిరాగము. అంతర గాంధార కైశికీ నిషాదములు రాగచ్ఛాయా స్వరములు. ఈ స్వరములను దీర్ఘముగఁ బలికించినచో రాగకళ చక్కఁగ స్ఫురించును. ఎల్లప్పుడును పాడఁదగినది.

| ఆరోహణము. | అవరోహణము. |
|---|---|
| స రి గ మ ప ధ ని స. | స ని ధ ప మ గ రి స. |

ప, ; ; * సరి | గా ; | మా ; ‖ పధా - ధపమ | గామా ; | గారీ ‖
; ; * వి. | రా ; | . ; ‖ ము. - ని. . | న . | . . ‖

గమాగరీ | సా ; | ; ; ‖ ; ; ; | సారీ | సాస్ని ‖
మ్మితి | నో | | ; ; ‖ ; ; ; | నే . | . . ‖

దా.స్ని * | సరి గా – రిగ | మా ; ‖ పధనిధపమ | గామా | గారీ ‖
. . * ఏ. | రా – . . | . ; ‖ ము. . ని. . | న . | . . ‖

గాపమగరి | సా ; | ; ; ‖ ; ; ; | సరిగమ | పమగరి ‖
మ్మితి. . . | నో ; | ; ; ‖ ; ; ; | నే. . . | . . . . ‖

సన్నిధని * సరి | గా – రిగ | మా ; ‖ పధనిసనిధ | పధనిధ | పమగరి ‖
. . . . * నే, | రా – . . | . ; ‖ ము. . ని. . | న . . . | . . . . ‖

గమపమగరి | సా ; | ; ; ‖ ; ; ; | సరిగమ | పమగరి ‖
మ్మి . . . | నో ; | ; ; ‖ ; ; ; | నే. . . | . . . . ‖

సన్నిధని * సరి | గమపా | ధనిసా ‖ సనిధపమా | గమపమ | గమగరి ‖
. . .* నే | ళూ . | ల. . ‖ బూ. . . | జ. . . | చే . . . ‖

గాపమగరి | సా ; | ; ; || ; ; ; | సరిగమ. | పమగరి ||
నీ తి . . . | నో ; | ; ; || ; ; ; | సే . . | . . . . ||

సనిధని *
. . . . * (నేరాముని)

అ. ; ; * దా | ధా ; | ధపపమ || పదధా ; | నీ ; | సా ; ||
; ; * వా | ర ; | ము . . || ని . జ ; | ధా ; | స ; ||

సనిధప * దా | ధా ; | నిధపమ || పధనిసనిధ | ధనిసస | సాసా ||
. . . . * వా | ర ; | ము . . || ని.జ. . . . | దా . . | . స ||

; ; ; - సరి | గా ; | మగరిసా || సరిసా ; | నీధా | ధా ; ||
; ; - వ రు | ల ; | కు . . . || రి . పు ; | రై. | న ; ||

; ; * ధని | సా | రిససని || సనిధా ; | నీ ; | సా ; ||
; ; * వా | రి | మ . . . || ద . మ ; | ణ ; | చు ; ||

; ; * స్రా | సనిధా | మా ; ‖ మా , గా , | గమపమ | గమగరి ‖
; ; * శ్రీ | రా . | . ; ‖ ము , డు | గా . . | .... ‖

సనిధని *
డో . . * (ఏరాముని)

చ. ; ; * పా | పా ; | పా ; ‖ ధపమా ; | పమగా | మగరీ ‖
; ; * ఏ | కాం; | త ; ‖ ము. న ; | స్థ . . | త . . ‖

; ; * గమ | పధనీ | ధా ; ‖ పాదధమప | గామా | గరిరీ ‖
; ; * స్తో. | త్రో . | ర్చ్చి ; ‖ జో.... | త్రా . | ట్టు . ‖

; ; * స రి | గమపా | మా ; ‖ గమపమపధ | దధపమ | గ రిసని ‖
; ; * కా. | తా. . | సు ; ‖ రు, . డు. . | నే... | యు... ‖

; ; * ధని | సారీ | గా ; ‖ గమపధపమ | గాగరి | రీసా ‖
; ; * చీ. | కా . | కు ; ‖ పై... . | రం. . | . చు ‖

; ; * దా | ధా ; | ధపపమ ‖ ధపాంధా , | నీ ; | సాం ; ‖
; ; * కో | క ; | మ... ‖ ది . ని , | ద ; | య ; ‖

సనిధప * దా | ధా; | నిధపమ ‖ పధనిసనిధ | ధనిసని | సాంసాం ‖
.... * కో | క ; | మ... ‖ ది . . ని . . | ద... | య . ‖

; ; - సరి | గాం ; | మగరిస ‖ సరిసాం ; | నీధా | ధా ; ‖
; ; - లే . | క ; | బా... ‖ ణ . ము ; | నే . | ని ; ‖

; ; * ధని | సాం ; | రిససని ‖ సనిధానీ | సాం ; | సాం ; ‖
; ; * ఏ. | కా ; | ఘు... ‖ జే. . . | ని ; | న ; ‖

; ; - సాం | సనిధా | పా ; ‖ మా , గా , | గమపమ | గమగరి ‖
; ; - సా | కే . . | త ; ‖ ప , తి , | కా. . . | . . . . ‖

సనిధని *
డో . . * (విరాముని)

(ఇతర చరణములును ఇటులే పాడుకొనవలయును)

అవతారిక:—ఇందు త్యాగయ్యగారు సంగీతవిద్యావిశారదులగు భాగవతోత్తముల కెల్లరకు నమస్కరించి గానవిద్యావైభవమును వెల్లడించుచున్నారు.

(47) మాయామాళవగౌళ - ఆది.

ప. విదులకు మ్రొక్కెద సంగీత కో (వి)

అ. ముదమున శంకర కృత సామనిగమ - విదులకు నాదాత్మక సప్తస్వర (వి)

చ. కమలా గౌరీ వాగీశ్వరీ విధి - గరుడధ్వజ శివ నారదులు
అమరేశ భరత కాశ్యప చండీ - శాంజనేయ గుహ గజముఖులు
మృకండుజ కుంభజ తుంబురు వర - సోమేశ్వర శార్ఙ్గదేవ నంది
ప్రముఖులకుఁ త్యాగరాజ వంద్యులగు - బ్రహ్మానంద - సుధాంబుధి మర్మ (వి)

ప్రతిపదార్థము.

సంగీతకోవిదులకున్-సంగీతమున పండితులగు పెద్దలకు
మ్రొక్కెదన్ - నమస్కరించెదను
ముదమునన్ - సంతోషముతో
శంకర కృత సామనిగమ విదులకున్ - శివునిచే పాడఁబడిన సామవేదమును నెఱింగినవారలకును

నాదాత్మకసప్తస్వరవిదులకున్ - ధ్వనిరూపముగ నున్న సరిగమపధని అను ఏడు స్వరముల నెఱింగినవారలకు

ప్రెుక్కెదన్ - నమస్కరించెదను

'కమలా. . .నారదులు'

కమల - లక్ష్మిదేవియు

గౌరీ - పార్వతియు

వాగీశ్వరీ - సరస్వతియు

విధి - బ్రహ్మయు

గరుడధ్వజ - విష్ణువును

శివ - శివుఁడు

నారదుఁడు - నారదుఁడును

'అమరేశ. . .గజముఖులు'

అమరేశ - ఇంద్రుడును

భరత - భరతాచార్యుఁడు

కాశ్యప - కాశ్యపుఁడు

చండీశ - చండికేశుఁడును (ప్రమథ గణములలో నొకఁడు)

ఆంజనేయ - ఆంజనేయుఁడు

గుహ - కుమారస్వామి

గజముఖులు - విఘ్నేశ్వరుఁడును

'మృకండు. . .వంద్యులకు

మృకండుజ - మార్కండేయుఁడు

కుంభజ - అగస్త్యుడు

తుంబురు - తుంబురుఁడు

వరసోమేశ్వర - సోమనాథుఁడు (రాగవిబోధము రచించిన వాఁడు)

శార్ఙ్గదేవ - శార్ఙ్గదేవుఁడు (సంగీత రత్నాకరమును రచించినవాఁడు)

నంది - నందియు (వాగ్గేయకారకుఁడు)

ప్రముఖులకున్ - మొదలైన పెద్దలకును

త్యాగరాజ వంద్యులగు - త్యాగరాజుచే నమస్కరింపఁ దగిన వారలైన — మనెడు పాలసముద్రముయొక్క - మర్మము నెఱింగిన పెద్దలను

బ్రహ్మానంద సుధాంబుధి మర్మవిదులకున్ - బ్రహ్మానంద — మ్రొక్కెదన్ - నమస్కరించెదను

విశేషార్థము:—'సామవేదాది దంగీతం సంజగ్రాహా పితామహాః' అనునటులు సామవేదసారమును సంగీతశాస్త్రముగా ప్రవర్తింపఁజేసెను. ఆ గానవిద్య ఏడుస్వరములచే నొప్పి సామాన్యులకు సయితము పాడఁదగినదియై, 'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసం ఫణిః' అనునటులు శిశువేమి, పశువేమి పాములనుసయితము ఆనంద మొందింపుచున్నది. అట్టి సంగీత శాస్త్రమునందు బ్రహ్మాదిదేవతలును అగస్త్య నారదాదిదేవ ఋషులును, మార్కండేయాది ఋషులును, తుంబురు కిన్నరులును, శార్ఙ్గదేవాది వాగ్గేయ కారకులును మిక్కిలి అభిరుచి గలవారలై దాని నెల్లెడల ప్రవర్తింపఁ జేయుచు భగవంతుని కల్యాణగుణములను పాలతో చక్కెర చేర్చిన చందముగ నీ సంగీతముతోఁ జేర్చి పాడుచు అందుచేఁ గలుగు బ్రహ్మానందమనెడి పాలసముద్రమునందు మునిఁగి తేలుచు దాని మర్మ మెఱింగినవారలై యున్నారు.

,, | ; గరిసా-నిసరిస | నిసరిససనిధా - పధనిధపమగమ ||
,, | ; సం. . -గీ . . . | . . . . త . . - కో. . . . . . ||

గరిసని *
. . . . * (విముబలుపు)

అ. ; * నిధాపమా - పాధానీసా | ; - నిధాపమా | పాధానీ - సారిస ||
; * ముదమున - శం . క ర | ; - ముదమున | శం. క - ర . . ||

నిస * ,, - పాధానీ - సరిగరి | రిసనా - ,, | ధాపాపధనీ-ధనిసానిసరిగ ||
. . * ,, - శం . క - ర . . . | . . . - ,, | శం. . . . - క. . ర . . . ||

రిసనా * నిధాపమా - పాధానీసా | ; - సరిగా ; | మాగా , రిసా ||
. . . * ముదమున - శం. క ర | ; - కృతసా ; | మ ని , గ మ ||

; * ,, | , | మాగా , రిగా ||
; * ,, | , | మ ని , గమ ||

త్యాగరాజ వంద్యులగు - త్యాగరాజుచే నమస్కరింపఁ దగిన వారలైన | మనెడు పాలసముద్రముయొక్క మర్మము నెఱింగిన పెద్దలకును



బ్రహ్మానంద సుధాంబుధి మర్మవిదులకు - బ్రహ్మానంద | మొక్కెదకు - నమస్కరించెదను

విశేషార్థము:—'సామవేదాది దంగీతం సంజగ్రాహ పితామహః' అనునటులు సామవేదసారమును సంగీతశాస్త్రముగా ప్రవర్తింపఁజేసెను. ఆ గానవిద్య ఏడుస్వరములచే నొప్పి సామాన్యులకు సయితము పాడఁదగినదియై, 'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసం ఫణీః' అనునటులు శిశువేమి, పశువేమి పాములనుసయితము ఆనంద మొందింపుచున్నది. అట్టి సంగీత శాస్త్రమునందు బ్రహ్మాదిదేవతలును అగస్త్య నారదాదిదేవ ఋషులును, మార్కండేయాది ఋషులును, తుంబురు కిన్నరులును, శార్ఙ్గదేవాది వాగ్గేయ కారకులును మిక్కిలి అభిరుచి గలవారలై దాని నెల్లెడల ప్రవర్తింపఁ జేయుచు భగవంతుని కల్యాణగుణములను పాలతోఁ జక్కెర చేర్చిన చందముగ నీ సంగీతముతోఁ జేర్చి పాడుచు అందుచేఁ గలుగు బ్రహ్మానందమనెడి పాలసముద్రమునందు మునిఁగి తేలుచు దాని మర్మ మెఱింగినవారలై యున్నారు.

| | | |
|---|---|---|
| ,, | \| ; గరిసా-నిసరిస | \| నిసరిసనిధా - పధనిధపమగమ ‖ |
| ,, | \| ; సం. . -గీ . . . | \| . . . . త . . - కో . . . . . . ‖ |

గరిసని *
. . . . *　(విముఖము)

| | | |
|---|---|---|
| అ. ; * నిధాపమా - పాధానీసా | \| ; - నిధాపమా | \| పాధానీ - సారిస ‖ |
| ; * ముదమున - శం . క ర | \| ; - ముదమున | \| శం. క - ర . . ‖ |
| నిస * ,, - పాధానీ - సరిగరి | \| రిససా - ,, | \| ధాపాపధనీ-ధనిసానిసరిగ ‖ |
| . . * ,, - శం . క - ర . . . | \| . . . - ,, | \| శం . . . . . - క. . ర . . . ‖ |
| రిససా * నిధాపమా - పాధానీసా | \| ; - సరిగా ; | \| మాగా , రిసా ‖ |
| . . . * ముదమున - శం. క ర | \| ; - కృతసా ; | \| మ ని , గ మ ‖ |
| ; * ,, | \| , | \| మాగా , రిగా ‖ |
| ; * ,, | \| , | \| మ ని , గ మ ‖ |

; * మమాగగా - మగరీస - నిధనిస | ; - నిస్సానిధప | ధపమగ - పమగరి ||
; * వి దు ల కు - నా. . . - దా . . | ; - త్మక స . . | స్త . . . - స్వ. . . ||

సని * ,, - నీధానిస్సరీస | స - స్సానీ - ధపమ | గమపధ-నిసనిధ-పధపమ-గమపమ ||
ర . * ,, - దా. . . . . | . . - త్మక - స. . | స్త. . . - . . .-స్వ. . - . . . . ||

గరిసని *
ర. . . * (విదులకు)

చ. ; * ధపధా ; - నీధపమ - ధపధా | ; - పధని - ధపమ | గామా - గమపమగరి-గమా ||
; * కమలా ; - గా. . - . . . రీ | ; - వా. - గీ . . | శ్య . - రీ . . . . .-వి ధి ||

; * ధపధా ; - పధనిస్సనిధపమ - ధపధా | ; - నిస్సని - ధపమ | ,, ||
; * కమలా ; - గా . . . . . . . . . రీ | ; - వా . - గీ. . | ,, ||

; * గమగమపా - దధపమ - గమగరి | సని - సా , రిగా | మా ; - ; ; ||
; * గరుడ . . - ధ్వ.జ . - శి . వ. | . . - నా , రదు | లు ; - ; ;

## ప్రతిపదార్థము.

పరమాత్ముని పాదములను - భగవంతునియొక్క పాదములను
పలుమాఱు - అనేక పర్యాయములు
చిరకాలము - చాలకాలము
తులసీ దళములచేత - తులసి దళములచేత
సంతోషముగాన్ - ఆనందము గలుగునట్లుగా
పూజింతున్ - పూజ చేయుదును
'సర...ముల్'
సరసీరుహ - తామరపువ్వులు
పున్నాగ - మోని సంపెంగపూలు
చంపక - సంపెంగపూలు
పాటల - పాటల పువ్వులు
కురువక ఎఱ్ఱ గోరంటపువ్వులు
కరవీర - గన్నేరుపువ్వులు
మల్లికా - మల్లెపువ్వులు
సుగంధరాజ సుమముల్ - సుగంధరాజములనెడి పువ్వులు
ధరన్ - భూమియందు (కలవో)
ఇవి - ఈపువ్వులు
ఒకపర్యాయము - ఒకసారి (మఱియొక పర్యాయము)
ధర్మాత్మునిన్ - ధర్మ స్వరూపుడును
సాకేత పురవాసునిన్ - అయోధ్యా పట్టణమునందు వేంచేసియున్నవానిని
'వర త్యాగరాజనుతున్'
వర - శ్రేష్ఠమైన
త్యాగరాజ - త్యాగరాజుచే
నుతున్ - స్తోత్రము చేయఁబడిన
శ్రీరామునిన్ - శ్రీరాముని (తులసీదళములచేన్)

; * మమాగిగా - మగరిస - నిధనిస | ; - నిస్సానిధప | ధపమగ - పమగరి ||

; * వి దు ల కు - నా. . . - దా. . | ; - త్మక స. . | ష్ట . . . - స్వ. . . ||

సని * ,, - నీధానిసరిస | స - సాంసీ - ధపమ | గమపధ-నిసనిధ-సధపమ-గమపమ ||

ర. * ,, - దా. . . . . | . . - త్మక - స. . | ష్ట. . . - . . .-స్వ. . - . . . ||

గరిసని *

ర. . . * (విదులకు)

చ. ; * ధపధా ; - నీధపమ - ధపధా | ; - పధని - ధపమ | గాపమా - గమపమగరి-గమా ||

; * కమలా ; - గా. . - . . రి | ; - వా. - గీ . . | శ్వ. - రీ . . . . .-విధి ||

; * ధపధా ; - పధనిసనిధపమ - ధపధా | ; - నిసని - ధపమ | ,, ||

; * కమలా ; - గా . . . . . . . . - . . రి | ; - వా . . - గీ. . | ,, ||

; * గమగమపా - దధపమ - గమగరి | సని - సా , రిగా | మా ; - ; ; ||

; * గరుడ . . - ధ్వజ . - కి . వ. | . . - నా , రదు | లు ; - ; ;

## ప్రతిపదార్థము

పరమాత్ముని పాదములను - భగవంతునియొక్క పాదములను

పలుమారు - అనేక పర్యాయములు

చిరకాలము - చాలకాలము

తులసీ దళములచేన్ - తులసి దళములచేత

సంతోషముగాన్ - ఆనందము గలుగునట్లుగా

పూజింతున్ - పూజ చేయుదును

'సర...ముల్'

సరసీరుహ - తామరపువ్వులు

పున్నాగ - మాని సంపెంగపూలు

చంపక - సంపెంగపూలు

పాటల - పాటల పువ్వులు

కురవక ఎఱ్ఱ గోరంటపువ్వులు

కరవీర - గన్నేరుపువ్వులు

మల్లికా - మల్లెపువ్వులు

సుగంధరాజ సుమముల్ - సుగంధరాజములనెడి పువ్వులు

ధరన్ - భూమియందు (కలవో)

ఇవి - ఈపువ్వులు

ఒకపర్యాయము - ఒకసారి (మఱియొక పర్యాయము)

ధర్మాత్మునిన్ - ధర్మ స్వరూపుఁడును

సాకేత పురవాసునిన్ - అయోధ్యా పట్టణమునందు వేంచేసియున్నవానిని

'వరత్యాగరాజనుతున్'

వర - శ్రేష్ఠమైన

త్యాగరాజ - త్యాగరాజుచే

నుతున్ - స్తోత్రము చేయఁబడిన

శ్రీరామునిన్ - శ్రీరాముని (తులసీదళములచేన్)

విశేషార్థము:—'తులసీదళములచే...' ఇత్యాదులచే, భగవంతుఁడు పత్ర పుష్ప సముదాయములలో మిక్కిలి శ్రేష్ఠమగు తులసీదళములచే చేయఁబడు అర్చనవలన మిగుల తృప్తినొందుచున్నాఁడనియు, తులసీదళము చిక్కకపోయిచో పుష్పపూజలచేతను తృప్తి నొందుచున్నాఁడనియు భావము. మఱియు అనేక పుష్పములచే చేయఁబడు పూజకన్న తులసీదళ మొక్కటిచే చేయఁబడు పూజయందు శ్రీమన్నారాయణుఁడు తృప్తినిఁజెందుచున్నాఁడనుట ప్రశస్తము.

| | | | |
|---|---|---|---|
| ప. నీధా | \| పామాగామా | ‖ ధ పపమ | \| గారీసాస్నీ ‖ |
| తుల | \| సీ. ద ళ | ‖ ము. ల. | \| చే. సం. ‖ |
| సా రీ | \| గాగాగా ; | ‖ గామధ | \| పధ – మపగామా ‖ |
| తో. | \| వ ము గ ; | ‖ బూ. . | \| . . – జిం. . తు ‖ |
| నీధా | \| పామాగామా | ‖ ధ పపమ | \| గారీసాస్నీ ‖ |
| తుల | \| సీ . ద ళ | ‖ ము. ల. | \| చే . సం. ‖ |
| సారీ | \| గాగాగా ; | ‖ గామా | \| గాగా – రిసస్నీ ‖ |
| తో. | \| వ ముగ ; | ‖ అ. | \| . . – సం. ‖ |

,, | ,, || ,, | గా ; – రిసన్రీ ||
,, | ,, || ,, | ; ; – సం. ||

,, | ,, || ,, | నిధపమ – గరిసన్రి ||
,, | ,, || ,, | ... . – సం. . ||

,, | గాగా – గమపధ || నిసరిసి | ,, ||
,, | పము – గ . . . || . ... | ,, ||

సారి | గాగాగా ; || గమపధ | నీ – ధపమగమా ||
తో. | వ ముగ ; || బూ. . | . – జిం. . తు ||

పాధా | పామా . గామా || పధపప | గమగా – రిసన్రీ ||
తుల | సీ . – దళ || ము. ల. | చే. . – సం. ||

సరిగరి | గమపమ – పధనిధ || ధనిస్రా | సని – ధప – మగమా ||
తో... | వ. ము. – గ... || బూ. | . . – జిం – . . తు ||

నీ నీ | నీ స్సా - నీస్సా || నిసరీ | గిమగారిస్సా ||
పలు | మా. - . బు || చి. ర | కా. . లము ||

నీస్సా | నీస్సానీరీ || గారీ | గిమపమగిరిస్సా ||
ప లు | మా. .బు || చీ ర | కా. . . ల . ము ||

నీస్సా | నీస్సా - నీరీ || గారీ | గామగిరిసని ||
ప లు | మా. - . రు || చి ర | కా . ల . ము.

సనిసరీ | సని - ధని స రిసని || ధనిస్సా | నీధాపామా ||
ప . ర . | మా - . . త్మ. ని. || పా. . | దము ల ను ||

చ. పాధా | పధపధ - మాపా || పమగమ | పా - ప మగామా ||
స ర | సీ . . . - రుహ || పు . . . | . -న్నా . . గ ||

ధపపమ | గారీ రి సస్సీ || సారీ | గామాగామా ||
చం. . | ప కపా. . || టల | కు రు వ క ||

గామా | పధనీస్సానీ || ధపమా | గా - గాగరిసని ||
క ర | వీ. . . ర || మ. . | ల్లి - కా . . . సు ||

గారి | గామాధామా || గ రిగమ | గ రి , - ; ; ||
గం. | ధ రా . జ || సు. మ. | ముల్ , - ; ; ||

పాధా | పామా - మాపా || మగమా | పాధాపాధా ||
ధ ర | ని వి - కొు క || న . రి | యా. యా ము ||

ధనిసరి | సా - నిధపాధా || ధ నిసా | నీ - సా ; సా ||
ధ . . . | ర్మా- . . త్ముని || సా. . | . - కే ; త ||

పాధా | సరిగారిసా || రిసాని | స నిధా - నీసా ||
పు ర | వా. . సుని || శ్రీ . . | రా. . - ముని ||

రిసని | ధనిసరి - సనిధని || ధనిసా | నీ - ధపపమగమ ||
వర . | త్యా. . - . . గ- || రా . | జ -ను. తు. ని. ||



అవతారిక:—ఇందు అయ్యగారు భగవంతుని స్వభావ గుణములను, విగ్రహ గుణములను భూషణాదులను తలంచి పలచి తా ననుభవించుటకై శ్రీరాములను ప్రార్థించుచున్నారు.

(౪౨) మాయామాళవగౌళ - దేశాది.

ప. మేరుసమాన ధీర వరద రఘు - వీర చూతును రారా మహా (మే)

అ. సారసార ఒయ్యారపు నడలను - నీరద కాంతిని నీ రీవని మహా (మే)

చ. అలకలముద్దును తిలకపుతీరును - తళుకుం జెక్కుటళ్ళతోఁ దనరు నెమ్మోమును

గళమున శోభిల్లు కనకభూషణముల - దళిత దుర్మానవ త్యాగరాజార్చిత (మే)

ప్రతిపదార్థము.

మహామేరుసమానధీర - గొప్ప మేరువు పర్వతముతో సమానమైన ధైర్యము గలవాఁడా

వరద - వరము లిచ్చువాఁడా

రఘువీర - రఘువంశమున శ్రేష్ఠమైన వాఁడా శ్రీరామా

సారసార - సారములో సారమైన వాఁడా

ఒయ్యారపునడలను - విలాసగమనములను

నీరదకాంతిని - మేఘమువంటి శరీరచ్ఛాయను

నీ రీవని నీ - నీటును

చూతును - సేవించెదను

నడలు, వీనిచే, 'నీలమేఘనిభం' అని నల్లని మేఘముతో సమానమైన దివ్యమంగళ విగ్రహమును, ఆవిగ్రహమునకు తగినటులు 'మత్తమాతంగ గామినం చతుర్గతిః' అనునటులు ఏనుగు సింహము, పెద్దపులి, వృషభము అను వీనియొక్క నడకలవంటి నడకలు గలవాడును; అట్లు నడుచునప్పుడు, 'అంజన పుంజ శ్యామకుంతలం' అనునటులు కాటుక రాశివలె నల్లనైనట్టి ముంగురులును పూర్ణ చంద్రునివంటి ముఖమున ప్రకాశించు కస్తూరితిలకమును, పళపళ మెఱయు చెక్కిళ్లును, కంఠమున నొకటికొకటి పెనుచుకొని యుండు కనకాభరణములును, సేవింప నాసగొని, తానుబోయి శ్రీరాముని సేవించిన ఈ నడక వైచిత్రము గనుపింపదుగాన, రామా! నీకుకొంచెము ప్రయాసమే యైనను నీవే రమ్ము; అని అయ్యగారు ప్రార్థించుచున్నారు

| | | | | |
|---|---|---|---|---|
| ప. ; | * | రిసని - సారి - గా ; ; - మగ | \| రిస - రి సనిసారి | \| గా; ; - మగ ‖ |
| ; | * | మే. - రు స - మా ; ; - న . | \| . . . - మే. . రుస | \| మా ; ; - న. ‖ |
| రిస | * | రిసని - సారి - గరిగా ; - మగ | \| రిస - ,, | \| గ రిగా ; - మగ ‖ |
| . . | * | మే. - రుస - మా . ; - న . | \| . . - ,, | \| మా. . ; - న . ‖ |

౩౦

రిస * రిసన్ని - సారి - గరిమగమప - గమపమ | గారిస- ,, | గరిమగపమ - గమపమ ||
.. * మే. - రుస - మా ... - న ... | ... - ,, | మా. . . . . - న ... ||

గారిస * రిసన్ని - సారి-గమపమ-గమపమ-గామా-గరి | సా ,, | గమపమ - గమపమ-గామా-గరి ||
... * రుస-మా. -. ... - . . . . . -. . . న. | . ,, | మా . . - . . . . . - . . -న. ||

సా * రిసన్ని - సారి - గమనినిధమ - గరి | సా ,, | గమనినిధమ - గరి ||
. * మే. - రుస - మా ... - న . | . ,, | మా. . . . . - న . ||

సా * రిసన్ని - సారి - గరిసా ; - మగ | రి - గమగమపధ | పధమపా , - గ మ ||
. * మే. - రుస - మా . ; - న . | . - ధీ . . రవ . | ర . దా. , - మహా ||

గరి * సన్ని - సారి - గరిగా ; - మగ | రి - గమగమపధ | పధపపా - గమా ||
.. * మే - రు స - మా . ; - న . | . - ధీ . . రవ . | ర . దా. - రఘు ||

; * పా , ధ నీ - రిసరిరిసన్ని - ధ ని | సరి - సా , నిధా | పాధప - మాపమ - గామగ-రిగరి ||
; * వీ , రచూ- తు. . . . . . - ను . | . . - రా , రాను | వా . . - . . . - . . . - . . . ||

రిస *
. . * (మేరు సమాన)

అ ; * ధా , పమా - గమగరి - సరిమగ | మా - గమప - మపధ | నిస్సనిధ - నిస్సనిధ ||
; * సా , ర . - సా . . . - ర . ఘ. | . - య్యా. - రఘు . | న . డ. - ల . . . ||

పా * ధా , పమా-గమపమ-గమపమ - గరిగగ | ,, | నిస్సనిధ - పధనిని ||
ను * సా , ర . - సా . . . . . . . . - ర. ఘ. | ,, | న . డ. - ల . . . ||

స్సా * పా , ధనీ - రిసరిరిసన్ని - ధని | సరి - స్సా , నిధా | పాధప - మాపమ - గామగ-రిగరి ||
ను * నీ , రద - కాం. . . . . - తి. | ని . - నీ , తీ . | వి . . . - . . . - . . . - ని. . ||

రిస *
. . * (మేరు సమాన)

చ. ; * పధాపమా - గారీగామా | ; - పధాపమ | గమపమగారీ - గగమా ||
; * అ ల క ల - ముద్దు. ను | ; - అ ల క ల | ము. . . . . - ద్దు. ను ||

; * పధాపమా - పమగరి - గమరీ | ; - సనీ్సరి | గరిమగ - పమగా ||
; * అ ల క ల - ము. . - ద్దు. ను | ; - తిలకపు | తీ. . . - రు . ను ||

; * గమాపధా - ప మగా - రి సని | ; - సరిగ మా | పాధాధపపమ - ధాపా ||
; * తళు కుజె - క్కు. ల్లి - తో. . | ; - దనరుచె | మొ్మ. . . . . - ము ను ||

; * దధా - పమా - గమగరి- సరిగమ | పా - గమాపధా | నిసనిధ - పధనిని ||
; * గ ళ - ముచ - శో. . .- భి. . . | ల్లు - క న క భూ | ష. ణ. - ము . . ||

సా * పధానిసా - రిసరిరిసని - సా | ; - సా , నిధా | పధపమ - గమగరి ||
ల * ద ళి త ను - రా్మ. -న . - వ | ; - త్యా, గరా | జా . . . - ర్చి. త. ||

సని * సనీ్సారి - గా ; మా ; | మగరిసా ; | ; ; - ; ; ||
. . * మే. రుస - మా ; న ; | . . . . ; | ; ; - ; ; ||

అవతారిక:—ఇందు త్యాగయ్యగారు, మంచివారలను ఎల్లరు రక్షింతురు, దుర్మార్గులను స్వతంత్రులగు రాజులును రక్షింపఁబూనరు. రాజకుమారుఁడైనను దుర్మార్గుఁడైనచో రక్షింపఁ

బడఁడు. ఇట్లుండ, శ్రీరామచంద్రా! నీ వెంతటి కృపానిధివైనను దుడుకుపనులకెల్ల పుట్టి నిల్లుగ నున్న నన్నెట్లు రక్షింతువు ? విచారించ నాతిప్పుల విచారింపక రక్షించవలసినదే గాక గమనింప బూనిన, ఇంచుకంతయు నాయెడ నొప్పులేదని, తన దుర్మార్గముల నొక పట్టిగ వ్రాసి అప్పగించు చున్నాడు.

(50) గౌళ - ఆది.

ప. దుడుకుగల నన్నే దొర - కొడుకు బ్రోచురా ఎంతో (దు)

అ. కడు దుర్విషయా కృష్టుఁడై - గడియఁ గడియకు నిండారు (దు)

చ. శ్రీవనితా హృత్కుముదాబ్జా - వాఙ్మానస గోచర (దు)

2. సకల భూతములయందు నీవై - యుండఁగ మదిలేక పోయిన (దు)

3. చిరుతప్రాయమునాఁడె భజనామృత - రసవిహీన కుతర్కుఁడైన (దు)

4. పరధనములకొఱకు నొరుల మదిని - కరగఁ బలికి కడుపునింపఁ దిరిగినట్టి (దు)

5. తనమదిని భువిని సౌఖ్యపు జీవనమే - యనుచు సదాదినములు గడిపెడి (దు)

6. తెలియని నటవిట ♦ శూద్రులు వనితలు - స్వవశమౌట కుపదేశించి సంత -
సిల్లి స్వరలయంబు లెఱుంగకయు - శిలాత్ములై సుభక్తులకు సమానమను (దు)

7. దృష్టికి సారంబగు లలనా సదనా - ర్భక సేనామిత ధనాదులను
దేవదేవ నెర నమ్మితిని గాకను పదాబ్జ భజనంబు మఱచిన (దు)

8. చక్కనిముఖ కమలంబును సదా - నా మదిలో స్మరణ చేయక దు -
ర్మదాంధ జనులకోరి పరితాప - ములచే తగిలి నొగిలి దుర్విషయ
దురాసలను రోయలేక సతత - మపరాధియై చపల చిత్తుడైన (దు)

9. మానవతను దుర్లభ మనుచు నెంచి - పరమానంద మొందలేక
మదమత్సర కామలోభ మోహములకు - దాసుడై మోసబోతి గాక
మొదటి కులజుడగుచు భువిని - శూద్రుల పనులు సల్పుచును ఉంటినిగాక
నరాధములను కోరి సారహీన - మతములను సాధింప తారుమారు (దు)

♦ 'క్షుద్రులు' అని యొక పాఠము.

10. సతులకై కొన్నాళ్లాస్తికై - సుతులకై కొన్నాళ్లు ధన -
తతులకై తిరిగితినయ్య - త్యాగరాజాప్త ఇటువంటి (దు)

## ప్రతిపదార్థము.

ఎంతో దుడుకుగల నన్నుఁ - మిక్కిలి దుర్మార్గముగల నన్ను
ఏ దొరకొడుకు - ఏరాజు కొమారుఁడు
ప్రోచుఁ రా - ప్రోచురా (కాపాడునురా)
కడుఁ - మిక్కిలి
దుర్విషయ - చెడువిషయములచేత
ఆకృష్టుఁడై - లాగఁబడినవాఁడై
గడియ గడియకుఁ - ఒక్కొక్క గడియకు
నిండారు దుడుకుగల నన్నుఁ - నిండిన దుర్మార్గముగల నన్ను (ఏదొరకొడుకుప్రోచురా?)

'శ్రీ...అబ్జ'
శ్రీవనితా - లక్ష్మీదేవియొక్క
హృత్ - మనస్సనెడు
కుముద - కలువ పువ్వునకు
అబ్జ - చంద్రునివంటివాఁడా
అవాఙ్మానసగోచరా - వాక్కునకు మనస్సునకు గోచరము కానివాఁడా (దుడుకు)
సకల భూతములయందుఁ - సకల ప్రాణులయందును
నీవు ఉండఁ కఁ - నీవే అంతర్యామివిగా వేంచేసియుండఁగా

మదిలేకపోయిన - బుద్ధిలేకపోయిన (నన్నెవరు రక్షింతురు)
(దుడుకుగల)
చిఱుతప్రాయమునాఁడు ఏ - చిన్నతనమునందే
'భజన...తర్కుఁడై'
భజన - నీ సేవయనెడి
అమృతరస - అమృతరసము
విహీన - బొత్తుగ లేకుండుటచేత
కుతర్కుఁడు ఐన - దురూహాలు గలవాఁడనై యుండిన
(నన్నెవఁడు రక్షించును)
(దుడుకుగల)
పరధనముల కొఱకై - ఇతరుల సొత్తుకొఱకు
ఒరులమది - అన్యుల మనస్సును
కరఁగఁ - కరఁగునట్లు
పలికి - చెప్పి
కడుపునింపక - పొట్ట పూడ్చుకొనుటకు

తిరిగినట్టి - తిరుగుచుండునట్టి
(దుడుకుగల)
తనమదిని - నా మనస్సునందు
భువిని - భూమియందు
సౌఖ్యపు జీవనము ఏ అనుచుక - సుఖమైన బ్రతుకే యనుచు
సదా - ఎల్లప్పుడును
దినములు గడపెడి - దినములులెక్కపెట్టునట్టి
(దుడుకుగల)
తెలియని నటవిట క్షుద్రులు - ఏమియు యెఱుంగని నటకులు విటులు క్షుద్రులును
వనితలు - స్త్రీలును
స్వవశము అవుటకు - నాకు లోఁబడుటకు
ఉపదేశించి - బోధించి

సంతసిల్లి - సంతోషించి

స్వరలయంబులు - స్వరమును తాళమును

ఎఱుంగకయును - తెలియకయును

శిలాత్ముఁడు ఐ - రాతివంటి మనస్సుగలవాఁడై

సుభక్తులకుఁ - మంచి భక్తులకు

సమానము అను దుడుకుగల నన్నుఁ - సా..ి యను

నట్టి దుర్మార్గముగల నన్ను (ఎవఁడు రక్షించును)

దేవదేవ - దేవతలకు దేవుఁడా

దృష్టికిఁ - చూపునకు

'సారంబు. . .ములను'

సారంబట - శ్రేష్ఠము గుచున్న

లలనా - స్త్రీలు

సదన - గృహములు

అర్భక - పుత్రులు

సేనా - సైన్యములు

అమిత ధనాదులును - లెక్కకెక్కువయగు ద్రవ్యము మొదలైనవానిని

నెరనమ్మితిని కాక - స్థిరమని బాగుగ నమ్మితినే తప్ప

నీ పదాబ్జ భజనంబు - నీ పాద కమలముల సేవను

మఱచిన - జ్ఞాపకము లేకయుండిన (నన్నెవఁడు బ్రోచును)

(దుడుకుగల)

చక్కని ముఖ కమలంబును - తామర పువ్వువంటి చక్కని నీ ముఖమును

సదా - ఎల్లప్పుడును

నా మదిలోఁ - నా మనస్సులోపల

స్మరణచేయక - తలఁపక

దుర్మదాంధ జనులఁ - గర్వముచే కన్నుగానని వారిని

కోరి - గోరి

పరితాపములచేతఁ - కష్టములచేత

తగిలి - చిక్కి

నొగిలి - శ్రమనొంది

దుర్విషయ దురాశలను - చెడుభోగములయందలి పేరాశలను

రోయలేక - విడువఁజాలక

సతతము - ఎల్లప్పుడును

అపరాధినై - తప్పులు చేయువాఁడనై

చపల చిత్తుఁడనై - స్థిరచిత్తము లేనివాఁడనై (దుడుకుగల)

మానవతనువు - మనుష్యదేహము

దుర్లభము అనుచుఁ - దొరకుట కష్టమైన దనుచు

ఎంచి - తలఁచి

పరమానందము - మిక్కిలి సంతోషమును

అందలేక - పొందఁజాలక

మద...లకుఁ - మదము, మాత్సర్యము, ఆశ, లోభము, మోహ మనువానికి

దాసుఁడై - లోఁబడినవాఁడనై

మోసపోతిఁ గాక - మోస మొందితినే తప్ప

మొదటికులమునఁబుట్టి - బ్రాహ్మణ కులమున పుట్టి

భువిని - భూమియందు

శూద్రుల పనులు - శూద్రులుచేయు కార్యములను

సల్పుచును - చేయుచును

ఉంటినిగాక - ఉంటినే తప్ప

నరాధములను - నీచమానవులను

కోరి - కోరి

సారహీన మతములను - సారములేని యితర మతములను

సాధింపఁ - సాధించుటకు

ధన తతులకై ఐ - ధన సమూహములకై
తిరిగితి అయ్య - సంచరించితి నయ్యా
త్యాగరాజాప్త - త్యాగరాజునకు హితుఁడవగు శ్రీరామా
ఇటువంటి దుడుకుగల నన్నే-ఇట్టి దుర్మార్గముగల నన్ను
ఏ దొరకొడుకు బ్రోచురా - ఏరాజు కుమారుఁడు గాపాడునురా

తాఁబూలు దుడుకు - తలక్రింద దుర్మార్గముగల నన్ను
(ఎవఁడు బ్రోచును)
సతులకై - స్త్రీలకై
కొన్నాళ్ళు - కొన్ని నాళ్ళు
ఆస్తికై ఐ - సొత్తునకుఁగా
సుతులకై ఐ - పుత్రులకుఁగా
కొన్నాళ్లు - కొన్ని దినములు

విశేషార్థము:—సీతాపతి ! నీవు సర్వాంతర్యామివై యుండఁగా, 'యథాహ్యక్షేత్రజ్ఞా హిరణ్యనిధిముపర్యుపరి సంచరంతః న విన్దేయుః' అనఁగా ఖనిజశాస్త్రపరిచయము లేనివారు పైపైని దిరుగుచు వారి యడుగులక్రింద నున్న బంగారు, రత్నముల గనులను తెలిసికొనలేని చందముగా నిన్నుఁ దెలిసికొనక చిన్నతనమునుండియు కుప్రశ్నలు చేయుచు పరదార పర ద్రవ్యాదులకును లోకమునందలి పెద్దపెద్ద వేగులకును నాసపడి నటవిటజనులతోఁ జేరి కాలమునంతయు దుర్విషయములచేతనే కడపిన పరమదుర్మార్గుని ఎవ్వఁడు గాపాడును?

'యాన్తి న్యాయ ప్రవృత్తస్య తిర్యఞ్చోఽపి సహాయతామ్ । అపన్థానన్తు గచ్ఛన్తం సోదరోఽపి విముంచతి' అనఁగా న్యాయమార్గమునఁబోవువారికి మృగములుపక్షులు సయితము సాహాయ్యమొనర్చుచుండును. దుర్మార్గమునఁ బోవువానిని తోడఁ బుట్టినవాఁడుకూడ వదలి పెట్టుచున్నాఁడు. ఈ న్యాయముచే కడు దుడుకుగల నన్ను, 'అదండ్యాన్దండయన్ రాజా దండ్యాం శ్చైవాప్యదండయన్ । అయశో మహదాప్నోతి నరకంచాధిగచ్ఛతి' అనఁగా దండింపఁదగనివారలను దండింపుచు దండింపఁదగినవారల దండింపకయుండు రాజు గొప్పఅపకీర్తిని నరకమును పొందుచున్నాఁడని శాస్త్రము ఘోషింపుచుండ శాస్త్రమునకు లోఁబడినరాజులు గాని, మఱియు నితర దేవతలుగాని మఱెవరుగాని యెట్లు రక్షింపఁగలరు.

కావున సర్వస్వతంత్రుఁడవై, 'యత్త్వత్ప్రియం తదిహ పుణ్యమపుణ్యమన్యత్' అనఁగా నీ కిష్టమైనది పుణ్యము నీ కిష్టము కానిది పాపము అని నిరూపించు నీవు రక్షింపవలెఁగాక మఱే దొరకొడుకు రక్షించునురామా? అని త్యాగయ్యగారు ప్రార్థించుచున్నారని భావము.

గౌళ రాగలక్షణము:—ఇది 15-వ మేళమైన మాయామాళవ గౌళయందుఁ బుట్టినది. వక్ర షాడవరాగము. ధైవతము వర్జ్యము. అవరోహణమునందు వక్ర గాంధార శుద్ధ ఋషభ శుద్ధ మధ్యమ కాకలీ నిషాదములు రాగచ్ఛాయా స్వరములు. ఎల్లపుడును గానము సేయఁదగినది.

ఆరోహణము. సా రి గ మ రి మ ప ని స

అవరోహణము. స ని ప మ రి గ రి స

ప. రీ రీ – పమపా ; – మపమగమా – | రిసరీ – పమగమ | రీ ; – రిని సా ||
దుడు – కు. . ; – గ . ల . . – | న. . . – న్నే. . | దో ; – ర . . ||

సారిమా – రిమపా – మాపనిపానీ – పామా | మా ;– మా ; – | పమగమ – రిరిపమ ||
కొ . డు – కు . . –ప్రో. . . . – . చు | రా ;– . ; – | ఎం. . . – తో . ||

అ. రీరీరీ ; రీసా – సరీమా | మా – సరిసారి | సనిసా – నీసా – ||
కడుదు ; ర్విష – యా . | . – కృ . . . | ష్టు. . – డై . . ||

రీమరీస – స రిసని – నిసనిప – పనిపమ | రిమపని – సనిసా – | పమమా – రిరిసస ||
గ . డి. – య. . . – గ . డి. – య . . | కు. . . – నిం . – | డా. . – రు. . . ||

రిరిసా – నిసరీ – సాసా – స ని | పాపపపప – పాప | పనిపా – పపనిస ||
శ్రీ. . – వనితా – హృ . – త్కుముదాబ్జ | అవా – జ్మా | న . స – గో. చర ||

చ. రిరి ససా , – రి స రిమామ – సరిమా | ని స రి రిమా – సరి | గా , మ – రి రి సస ||
సకలభూ , – తములయందు – నీ. వై | యుండ.గా. – మది | లే ,.క – పోయి. న ||

2. స రిరిపమా – రి రి ససాన – రిపమా | రి స – నిపరిసాస – | పమా మ – రిరిస ||
చిఱుత ప్రా – యము. నా డె – భజనా | మృత – ర సవిహీన – | కుత ర్క – డై. . ||

3. పపమమ – రి రి స స – రి ప మమరి స – రిప | మ – రిపమ – నిస రిమ | , మ – రిరిససాస ||
పరధ న – ములకొఱ – కొరుల . మది – కర | గ – బలికి – కడుపునిం | , ప – దిరిగి న ట్టి ||

4. నిప – మపని – రి మ పనీ – పనీ | సా – రి మ పనిసా – | సనిప మ – రిరి సస ||
తన – మదిని – భువిని సౌ – ఖ్యపుజీ – వన | మే – యనుచుసదా – | దినములు – గడపెడి ||

5. రి రి పప – రిరిమమ – స స రి రి – పని సరి – | పమమ రి సస – ని ప | పమాని – పనిసరి ||
తెలియని – నటవిట – క్షుద్రులు – వని తలు – | వశ . మా . టు– రుప | దేశించి – సంత సి ||

రి మ – రి సనిసారి – మ రిరి స ని – రిస | , స నిప –సనీ ప | మరి – నిపామరి స ||
ల్లి . – స్వరలయంబు– లెఱుంగ కయు – శిలా | , త్మ డై. – సుభక్తు | లకు – సమానమను ||

6. సారిరిసాసా - రిస రిగమా - రిప | మాపని - పామా - | ప నిపమా - రి రి స ||
స్రృష్టికిసారం - బగులలనా - సర | నార్భక- సే నా - | వి తథనా - దులను ||

సా - పసనిపా - రిసనిపా - స నిపమ | , - నిపమరీ సస - | పసాని - పమ రిస ||
దే - శ . . దే- వనెరన - మ్మితినిగా | , - కమపదాబ్జభ- | జనంబు - మఱచిన ||

7. పాప- మరి స - రిమపామరిస - రి రీ | మా - స రిమా - ని స | రిగామరీ - సరి ||
చక్ర- నిముఖ - కమలంబును. - సదా | నా - మదిలో - స్మర | ణచేయక - దు. ||

సపా స - పమరిసాస - నిపపా - పస | నిపా - పమరి - పమ | ని - పా , సనిసా - ||
ర్మదాంద - జనులకోరి - పరితా - పము | లచే - తగిలి - నొగి | లి - దు , ర్విషయ - ||

రిగ్రీషుర్రీషు - సరీషుగ్రీస - నిపని - స | రిసానిప మ - రి మ | పనీ ప - మమరిస ||
దురాశలను - రో.యలేక - సతత - మ | పరాధిరై. - చప | లచిత్తు - డై . న. ||

8. సారిస - నిసరీ రి స - ని స రిమామ - | సరిమా - రిమస - రి | , స - సాసా ; - ||
మానవ - తనుదుర్లభ - మనుచునెంచి- | పరమా - నం.ద - మొం | , ద - లే క ; - ||

ప పమారిస - రిమప - రీ మ - రి ప మ | రి స - పామ రి - సరి | మరీ స - సాసా ||
మదమత్సర - కామ - లోభ- మోహము | లకు - దాసుడై - మో | సపోతి - గా క ||

ప నిప - ప నిప - మపమ -రిపమ - రి మ ప ని | పని సి - రీమపని - | ప మరిస - సాసా - ||
మొదటి- కులజు - డగుచు - భువిని- శూద్రు. ల | పనులు - సల్పుచును - | నుంటిని - గా క - ||

సిస్రాసి - రిమరిరిమ - సి రిమ రిసి | ని పని సి - రిస్రాసి | నిప - పామరీ స ||
న రాధ- ములనుకోరి - సార . హీన | మదముల - నుసాధిం | ప. - తాలుమాలు ||

9. రి పపమ - గమరిస - నిసరిమ - రిమపా | రిమపా - రీ మా | రీసా - పమపమ ||
సతుల. - . . కై- కో . . . - . . . | న్నా. - క్లా. | స్త్రీకె - సు. తు. ||

గమరిస - సనిధా - నిసరిమ - రిమపని | పా ; - పా ; | పమమా - పమమా ||
ల . . . - కై. . - కో. . . . - . . . . | న్నా; - క్లు ; | ధ . . - న . . ||

రీ రీ రీ రీ - సరిమా - సరిమా - | రీసరి - సనిధా | సా ; - సా . ||
తతులకై - తి. రి - గి. . - | తి. . - న . . | యోగ్య;- . ; ||

| | | | |
|---|---|---|---|
| ర్రీమరిసే - సరిసని - దిసనిప - పనిపమ | రిమపని - సనిపమ | మగమా - రిరిసస | ‖ |
| త్యా . . - గ . . . - రా . . . - జా . . | స్తు . . . - ఇ.టు. | వం . . - టి . . | ‖ |

అవతారిక:—ఇందు త్యాగయ్యగారు శ్రీరాములవారి అనుగ్రహబలమే గాని యెట్టిగ్రహముల బల ముండినను ఏమియు నుపయోగము లేదనుచున్నారు.

(51) రేవగుప్తి - దేశాది.

ప. గ్రహబలమేమి శ్రీరామానుగ్రహబలమే బలము (గ్ర)

అ. గ్రహబలమేమి తేజోమయ వి - గ్రహమును ధ్యానించు వారికి నవ (గ్ర)

చ. గ్రహపీడలఁ బంచపాపముల నా - గ్రహములుగల కామాదిరిపుల ని -
గ్రహము సేయు హరిని భజించు - త్యాగరాజునకు రసికాగ్రేసరులకు (గ్ర)

ప్రతిపదార్థము.

గ్రహబలము - సూర్యాది గ్రహములయొక్క బలము   ఏమి - ఏమి యుపయోగము

'ఏకోవిష్ణుర్మహద్భూతమ్' అనునటులు భూతముల కన్నిటికంటెను పెద్ద భూతమైన భగవంతుని నిజమైన శక్తి నెఱుంగనివారికి, ఈ చిల్లర గ్రహములయొక్క కటాక్ష మావశ్యకమై యుండును. ఇది విచారింపఁగా రాజానుగ్రహ సంపాదించుకొన శక్తి లేనివారలు బంట్రౌతులు [illegible]దల[illegible]న వారిని ఆశ్రయించునటు లున్నది. ఏలయన, కింకుర్వన్తి గ్రహాస్సర్వే శనిభౌ మః [illegible]దరః ఏకాదశస్థే గోవిన్దే' [illegible]నునటుల తేజో మః [illegible] బ్రిగహాః ఏకాదశస్థానమును మనస్సునం[illegible] [illegible]సిలి కొని ధ్యానించువారి! శని, కుజుఁడు [illegible]ల. న గ్రహాః [illegible] గాత్రము ఏమి చేయఁగలవు ?

'స్వర్ణస్తేయీ సురాపాయీ బ్రహ్మఘ్నో గురుతల్పగః ... తత్సంసర్గస్తు పంచమః' [illegible]నునటులు బంగారు దొంగిలించుట, కల్లుత్రాగుట, బ్రాహ్మణునిఁజంపుట, గురుపత్నిని గూడుట, [illegible]కార్యము లొనర్చు నలుగురతో చేరుట అను పంచ మహాపాతకములను, కామ క్రోధ లోభ [illegible]హ మద మత్సరములును, 'హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపిస్మృతః అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హిపావకః' అనునటులు నిప్పుచూడక త్రొక్కినను కాలు గాల్చిన చందముగ భగవ[illegible] [illegible]నిమీఁదను ప్రీతి లేక 'హరి' యని స్మరించినమాత్రమున నశింపఁజేయుచున్నాఁడు ఈ మర్మము [illegible]సి భగవంతునే

ధ్యానించు త్యాగరాజును గాని, త్యాగరాజువంటి భక్తాగ్రేసరులనుగాని నవగ్రహములు, నపాప ములు, నే పిశాచములుగాని యేమియు చేయఁజాలవనియు; 'ధ్యేయో నారాయణస్సదా' అను నటులు సదా ధ్యానము చేయఁదగినవాఁడు శ్రీమన్నారాయణుఁడే యనియు నింకు అత్యద్భుతముగా వెల్లడించుచున్నారు.

రేవగుప్తి రాగలక్షణము:— ఇది 15 వ మేళమునందుఁ బుట్టినది ఔడవరాగము. ఆరోహణావరోహణములయందలి మధ్యమ నిషాదములు వర్జ్యములు. శుద్ధ ఋషభ అంతర గాంధార శుద్ధ ధైవతములు రాగచ్ఛాయా స్వరములు. రాత్రియందు నాల్గవ యామమునందు పాడఁదగినదని కొందఱిమతము. ఎల్లప్పుడును పాడఁదగినది. ఈ రాగమునకు 'రేగుప్తి' అనియు నొక నామము గలదు.

ఆరోహణము.　　　　అవరోహణము.

స రి గ ప ధ స　　　　స ధ ప గ రి స

ప. ; * ధాపాధగా-పగ-పాధప-గా,పగారీ | రీ - సారిసపా - ధాఫాధా | సా ; ; ; ||

; * (గ హ బల... -మే. .-- . , . . . | మి- (శ్రీ ... - రా . . | మా ; ; ; ||

,, | ,, | సారీసరిగా - ; ; ||
,, | ,, | మా.... - ; ; ||

,, | ,, | సారీ-సరిగా-రిగపా-గపధప ||
,, | ,, | మా.- ... - . . - .... ||

ధా * గ గాపధాపా - పాపగాపాధ - ధప | గరి - సారిససా - ధ.ప.ధ. | సా ; ; ; ||
ను * గ్రహాబల మే - . . . . . . - బల | షు - శ్రీ . . . - రా . . | మా ; ; ; ||

అ. ; * పగాపధా - సాం ; ; సాం | ; - పగాపధా | సాం ; ; సాం ||
; * గ్రహాబల - మే ; ; మి | ; - గ్రహాబల | మే ; ; మి ||

,, | ధప - పగాపధా | ,, ||
,, | . . - గ్రహాబల | ,, ||

ధప * పగాధపధా-సాం-ధసరిసి-సరిగరి-సాం | ,, | సాం-ధసరిసి-సరిగరి-సాం ||
. . * గ్రహాబల -మే- .... - .... -మి | ,, | మే- .... - .... -మి ||

ధప * పగా - పధా - సా - ధసిరిసి-రిసా | ; - సిసిరిసా - సిరిగా ;-| రిరిగిరి - సాధప ||
. . * గ్రహ - బల - మే - .... - .మి | ; - తే ... - జో . ;-| మ.యా. - . వి . ||

పా * ధపాధ గా - పాధా - సిసిరిసిరి ; | ; - రిసిసిధపమ | రిసిరిధ - సిధసిధ ||
. * గ్రహములు - ధ్యా . - నిం. . . , ; | ; - చు. . వా . | రి . కి . - న . వ. ||

పగ *
. . * ((గ్రహబల)

చ. ; * గగపా ; - ధాపా - గపధా | పా-గా, ప - ధపా , - గప | గా-గ ధపపగా-గాగాగరి ||
; * గ్రహపీ; - డ ల - బం . | చ - పా, . - . . , - ప . | . -ము.ల . . - నా . . . ||

; * ధపాధగా - పగగరి - సారీ - రిసపా | ; - రీ సారి | గాపా - పసాసా - సాధా ||
; * గ్రహములు- గ . ల. - కా. - . . . . | ; - మా. ది | రి పు - ల. . - ని . ||

; * పగపా - ధాసాసా ; - రిసి | రి - గా - రిసిసా - ; | సాధా - ధపపగ - ధాపా ||
. ; * గ్రహము - సే . యు ; - హరి | ని - భ - జిం. . - ; | చు. - . . . . - త్యా . ||

ధగగా * గపాపధా - సా ; - ధసరిసరి ; | ; - రిసస - ధపధ | రిసరిధ - సధసధ ||
గ . . * రాం జువ - ను ; - ర . సి. . ; | ; - కాం . - గ్రే . | స . రు. - ల. ను. ||

పధ *
. . * (గ్రహబల)

అవతారిక:—ఇందు త్యాగయ్యగారు శ్రీరాములవారి బాణప్రభావమును గుఱించి మనస్సునకు బోధించుచున్నారు.

(52) సావేరి - ఆది.

ప. రామబాణ త్రాణ శౌర్య - మేమని ¶ తెలుపుదురా ఓ మనసా (రా)

అ. భామ కాసపడు రావణు మూల - బలముల నేలఁగూలఁ జేయు (రా)

చ. తమ్ముఁడు బడలినవేళ సురరిపు - తెమ్మని చక్కెర పంచీయఁగఁ గని
లెమ్మనుచును నింద్రారి పల్కు-సమ - యమ్మని లేవఁగా

¶ 'పొగడుదుర' అని యొకపాఠము.

సమ్మతితో నిలఁబడి కోదండ పు - జ్యా ఘోషమ్ము లశనులఁజేసి తా -
నెమ్మదిగల తోడును జూచెనురాని - జమ్మగఁ ద్యాగరాజ నుతుఁడగు (రా)

ప్రతిపదార్థము.

మనసా - ఓ మనస్సా
రామబాణత్రాణ శౌర్యము - శ్రీరాముల బాణముల
  రక్షించుశక్తి
ఏమి అని - ఎటువంటిదని
తెలుపుదురా - బోధింతురా
భామ కాసపడు రావణు మూలబలము-సీతాదేవిపై ఆశ
  పడు రావణాసురుని మూలబలములను
నేలఁ - భూమియందు
కూలఁజేయు రామబాణత్రాణ శౌర్యము - పడఁగొట్టినట్టి
  శ్రీరామబాణ ప్రభావము (ఏమని)

తమ్ముఁడు - లక్ష్మణస్వామి
బడలిన వేళఁ - శ్రమ నొందిన సమయమున
సురరిపు - రావణాసురుఁడు
చక్కెర తెమ్ము అని - చక్కెరను తెమ్మని పలికి
పంచి యియ్యఁ - పంచియియ్యఁగా
కని - చూచి
ఇంద్రారిఁ - ఇంద్రవైరియగునొక రాక్షసుని
లెమ్ము అనుచుఁ - లెమ్మనుచు
పల్కఁ - పల్కఁగా
సమయమ్ము అని - చక్కెర పంచుటకు తగిన సమయమని

లేక౯ రాక౯ -(ఆరాక్షసుఁడును) లేవఁగా
తాన౯ - తాను (రాముఁడు)
సమ్మతితో౯ - నిండు మనస్సుతో
నిలఁబడి - నిలిచి
కోదండపు జ్యాఘోషమ్ములు - ధనుష్టంకారములను ధ్వనులను
అలసుల౯ - పిడుగులుగా

చేసి - చేసి
సౌమిత్రిగలతోడును - స్తిమితముగల లక్ష్మణుని
చూచెనురా - చూచెనురా
నిజమ్ముగ౯ - నిజముగ
త్యాగరాజనుతమగు రామబాణ ప్రాణ శౌర్యము - త్యాగరాజుచే కొనియాడఁబడు శ్రీరామబాణ రక్షణ ప్రభావము (నేమనిదెలుపుదురా)

విశేషార్థము:—మహావీరుఁడగు లక్ష్మణుఁడు యుద్ధమున బడలిపోఁగా రావణాసురుఁడు సంతోషముచే శర్కర పంచిపెట వలయునని కూడ యోజించెను. ఆ సమయమున శ్రీరాముఁడు దృఢ మనస్సుతో నిలఁబడి ధనుష్టంకారములు చేయుచు యుద్ధముచేసి రావణాసుల నోడించెను. అంతఁ గొంతసేపటికి తెప్పిరిలి స్తిమితమనస్కుఁడైన లక్ష్మణునిఁజూచి సంతోషించెను.

అనఁగా ఎంతటి మహావీరులకుఁగూడ నాపద వచ్చినప్పుడు నిరంకుశముగా రక్షించునది శ్రీరామబాణముతప్ప మఱియొకటిగాదు. కావుననే రామబాణ మమోఘమని లోకోక్తిగలదు.

విభీషణుఁడును, ' యావన్న గృహ్ణంతి శిరాంసి బాణా రామేరితా రాక్షసపుంగవానామ్ ।
వజ్రోపమా వాయుసమానవేగాః ప్రదీయతాం దాశరథాయ మైథిలీ' అనఁగా అన్నా! రావణా!
శ్రీరామబాణములు వజ్రాయుధముల వంటివి, వాయువేగము గలవి, అవి యీరాక్షసుల ప్రాణములు
దీయక మునుపే సీతను శ్రీరామునకు సమర్పింపుము అని మహాప్రాజ్ఞుఁడుగాన మొట్టమొదటనే
శ్రీరామబాణప్రభావమును వెల్లడిచేసెను.

సావేరి రాగలక్షణము:—ఇది 15 వ మేళమైన మాయామాళవ గౌళయందు జనించినది. షాడవ
సంపూర్ణరాగము. అంతర గాంధార శుద్ధ మధ్యమ శుద్ధ ధైవతములు రాగచ్ఛాయా స్వరములు.
ఈ రాగమునందుఁగల అంతర గాంధార కాకలీ నిషాదములు ఒకశ్రుతి తక్కువగనే పలుకును.
అట్లుండినఁ గాని యీరాగకళలు చక్కఁగ స్ఫురింపవు. పూర్వాచార్యులు లక్షణ గీతములయందలి
సాధారణ గాంధార కైశికీ నిషాదములనే ఉపయోగించినటులును తెలియుచున్నది. 'సనిప' అను
ప్రయోగమునందు కాకలీ నిషాదమును, 'సరిగమగా' అను ప్రయోగమునందు అంతర గాంధార
మును శుద్ధముగఁ బలుకును. ఇతర సందర్భములయందెల్ల నీ రెండు స్వరములును కొంచెము
తక్కువగనే పలుకునను విషయము అనుభవవేద్యము.

ఆరోహణము.
స రి మ ప ధ స

అవరోహణము.
స ని ధ ప మ గ రి స

సరిగరి - గారిగరీ - రీమపధమాగరి - పధనిధపమగరి మున్నగునవి రాగ రంజకములు.

| | | | |
|---|---|---|---|
| ప. ; * గగరిసా - సా ; సన్నిధా - రిసరీ | ; - సరిమాపమ | పా ; ; - సా | ‖ |
| ; * రా. . మ- బా ; . . . - . .ణ | ; - త్రా. ణ . | శా ; ; - ర్య | ‖ |
| 2. ధపమా * ,, - ససరిససన్నిధా - రిసరీ | ,, | ,, | ‖ |
| ... * ,, - బా.... . - . . ణ | ,, | ,, | ‖ |
| 3. ,, * ,, | ,, | పధసా ; - నిధ | ‖ |
| ,, * ,, | ,, | శా . ; - ర్య | ‖ |
| 4. ధపపమ * ,, | ,, | పధ - సారిగి - రిసనిధ | ‖ |
| .... * ,, | ,, | శా - ... - . . ర్య | ‖ |

5, ,, * ,, | ; రిసరిమపా | పాధా - ధపపమ - ధపధా ||
,, * ,, | ; త్రా . ణ | శ్రా . - . . . . - . . ర్య ||

; * పధారిస్సా - గరిస్సా - నిపధా | స్సా ; ; - స్సా | నినిధా - నినిధమ ||
; * మే. మని - తె. లు - పు. దు | రా ; ; - ఓ | . . . - మ. న. ||

గరి * గరిగరిసా - సనిధారీస్సా | ; - రిరిపమపధ | పాధా - ధపపమ - ధపధా ||
స * రా. . మ - బా . . ణ | ; - త్రా . . ణ | శ్రా . - . . . . . - . . ర్య ||

; * పధా - రిస్సా - గరిస్సా - నిపధా | నిసిరిసి - గ్రీ ; - స్సా | నిదధా - ని నిధమ ||
; * మే. - మని - తె. లు - పు.దు || రా . . - . ; - ఓ | . . . . - మ. న. ||

గరి * గరిగరిసా - సనిధా - రీసా | ; - రిరిపమపా | పాధాధపపమ - ధపధా ||
స. * రా. . మ - బా . - . ణ | ; - త్రా . ణ | శ్రా . . . . . . - . . ర్య ||

; * పధా - రిస్సా - గరిస్సా - నిపధా | సరిగరి - గ్గా ; - రిసి | నిదధా - ని నిధమ ||
; * మే. - మని - తె. లు - పు.దు | రా . . - . ; - ఓ. - | . . . . - మ. న. ||

గరి *

స. * (రామబాణ)

అ. ; * దాధాపా ; - పామధధా | ; - పధానిధా | సా ; ; - నిధ ||

; * భామ కా ; - స . ప డు | ; - రావణు. | మూ ; ; - ల. ||

పమ * దాధా-పాధా-ధపపమ-పాసదధా | ,, | ,, ||

. . * భామ -కా . - . . . . . - స . పడు | ,, | ,, ||

పమ * ,, | ,, | సాపధసా - నిధ ||

. . * ,, | ,, | మూ. . . - ల. ||

పమ * ,, | ,, | సా ; - నిసరిసి ||

. . * ,, | ,, | మూ ; - ల . . . ||

రి * రిగారిసా - నిసరిసనిధపమ పాధా | రిసరి - ధపధా | పా ; - ధనిధప ||

. * బల ముల - నే. . . . . . . . - . ల | గూ . - ల . . | జే ; - యు. . ||

గరి * ,, - ధపధా | నిసరిసర్రీ ; - మపధపధా ; | ,, ||
.. * ,, - .. ల | గూ ...; - ల.... ; | ,, ||

గరి * ,, | ,, | పమపధ - ని నిధమ ||
.. * ,, | ,, | జే....- యు.. ||

గరి *
.. * (రామబాణ)

చ. నిధని ప - ధపధమ - దధపధ - ధ నిపధ | స్సాని ధ - ప మ గరి | సారిమపమ - పమ ||
తమ్ముడు - బడలిన - వే. ళ. - సురరిపు | తెమ్మని - చక్కెర | పంచీ. యగ - గని ||

మరిపమ - ధ పధా - ధాపమగా - రిస | ధ్యా స రి - పా, మ | గా, రి - సా ; ||
లెమ్మను - చును ఇం- ద్రారిపల్క - సమ | యమ్మని - లే, వ | గా, .. - . ; ||

సరిగరిసా - ధపపమ - సానిదధప | ధ రిస్సా - ని ధ ప ని | ధప - పధసిసిస్సా ||
సమ్మతితో - నిఒబ డి - కోదండపు | జ్యా.ఘో-షమ్ములకి | నుల - జే.. సితా ||

సరిగిసి - రిసిరి - గి రిసా నిదధా | ధరిసా నిధ - రి | సి - దాధ- పప గ రి ||
నెమ్మది - గలతో - డునుజూచెనురా | ని . జమ్ము గ - త్యా | గ - రాజ- నుతము గు ||
రి *
. * (రామబాణ)



అవతారిక:— ఇందు అయ్యగారు, రామా ! నీవును ధనవంతులనే యాదరించెదవా నావంటి దరిద్రుని కటాక్షింపవా యని న్యాయనిష్ఠురము లాడుచున్నారు.

(53) సావేరి - దేశాది.

ప. దరిదాపులేక వేఁడిన - దయరా దేమో శ్రీరామ (ద)

అ. కరిధనములు కలిగినఁ - గరుణించి ప్రోతు వేమో (ద)

చ. అలనాఁడు నిర్జరవైరి బా - లునిజూచి బ్రోచితివి గాని
వలచి పదముల నమ్మిన - వరమీయఁ దోచునా త్యాగరాజు (ద)

ప్రతిపదార్థము.

శ్రీరామ – ఓరామ
దరి – గట్టు
దాపు – దగ్గఱనుగూడ
లేక – కనుపింపక (వేఱుగతిలేక)
వేఁడినన్ – స్తోత్రముచేయఁగా
దయరాదు – కృపగలుఁగదు
ఏమో – ఏమికారణమో
కరిధనములు – ఏనుఁగులు, ద్రవ్యములు
కలిగినన్ – కలిగియుండినచో
కరుణించి – కటాక్షించి
ప్రోతువు ఏమో – కాపాడెద వేమో

అలనాఁడు – అప్పుడు
నిగ్రహపైరిబాలునిన్ – ప్రహ్లాదుని
చూచి – చూచి
ప్రోచితివి కాని – కాపాడితివిగాని
గలచి – ఆశపడి
పదములన్ – నీపాదములను
నమ్మినన్ – నమ్మఁగా
వరమీయన్ – వరమిచ్చుటకు
తోచున ఆ – తోఁచునా
త్యాగరాజు – త్యాగరాజు
(దరిదాపులేక)

విశేషార్థము:—'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనునటులు అన్నిటిని వదలి గత్యంతరము లేక నీ పాదములనే ఆశ్రయించినవారిపైని కరుణ రాకయున్నది. కృష్ణా! నీ వాక్యమును నీవే మీఱే

దవా ? లేకున్న శ్రీమంతులకై యాసపడుట యేల, 'పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి' అనునటులు ఆకుగాని, పుష్పముగాని, పండుగాని, ఉదకముగాని భక్తిపూర్వకముగ సర్పించినయెడల పరమానంద మొందుచున్నానని పల్కిన నీకు ధనములపైని ఆశ యుండఁదగునా ? మఱియు ఉభయవిభూతినాథుఁడ వగు నీకు ఈ యల్పములగు నైశ్వర్యములు లక్ష్యములా ? కాదు. అయినను ప్రకృతము నన్ను కటాక్షింపకుండుటకు వేఱొక కారణము దొరకనందున 'కో హ్యర్థతృష్ణాం విసృజేత్' అనునటులు లోకములో ధనాశ లేనివాఁడు లేఁడు గావున నీవును అట్టివారితోపాటు ధనికులనే కటాక్షింపవలెనని యోజించుచుంటివేమో యని నా మనస్సునకు తృప్తిగా నేనొక కారణము గల్పించుచున్నానని భావము.

మఱియు 'నిర్జరబాలుని' అనుపదముచే సాధువులై, సదా నీ పదారవిందముల నమ్మిన మంచివారి వంశములోఁ బుట్టిన నన్ను రక్షించుట కష్టముగ నున్నది. దేవతలకు విరోధియై, దురాచరణపరాయణుఁ డగు హిరణ్యకశిపునిపుత్రుని రక్షించుట పరమసులభముగ నున్నది. ఆహా ! ఏమియీ న్యాయము ! 'అయినవారికి ఆకులలోను కానివారికి కంచములో' నన్న ట్లున్నదే ! ఇది

నీ స్వాతంత్రియమును జూపుటయూ లేక భక్తుండుగాని ధనికునైనను రక్షించెదను, రాజునైనను రక్షించెదను కాని, త్యాగరాజునుమాత్రము రక్షింపనని కంకణము గట్టుకొని యుంటివా ? అని త్యాగయ్యగారు భగవంతునితో న్యాయ నిష్ఠురము లాడుచున్నారని తాత్పర్యము.

34

| | | |
|---|---|---|
| ప. ; ; ; * రీసాధా ; - పమ | గారీరీ - సని | ధా - సా , రిమా ‖ |
| ; ; ; * ద రి దా ; - పు. | లే . . - క . | . - వే , . డి ‖ |
| పాధా ; * రీసా - నిధనిధపమ | గరిగరీ , - సని | ధా - రిసారిమా ‖ |
| న . ; * ద రి - దా . . పు. | లే. . . , - క. | . - వే. . డి ‖ |
| పాధా ; * ,, | ,, | ధా - సరిమపధని ‖ |
| . . ; * ,, | ,, | . - వే. . . డి. ‖ |
| ధాపమపధ * సరిగా - రిసనిధపమ | రి ; ; - సని | ధా - రిసారి - ధా ‖ |
| న. . . . * ద . రి దా. . . . పు. | లే; ; - క. | . - వే. . - డి ‖ |
| పమధా ; * దాధా - పధనిధపమ | గ రిగ - రిసనిధా | ; - సరిపమ - ధసి ‖ |
| న . . ; * డ య - రా. . . . | దే. . - మో. . | ; - శ్రీ. . . - రా. ‖ |

